# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

## ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] [సంచిక 4-5

15 జూలై - ఆగష్టు 1952





సంపాదకులు :
శ్రీయుత మహోవాది వేంకటరత్నముగారు బి.ఏ.

వ్యవస్థాపకులు :
శ్రీయుత ఈదర వెంకయ్యగారు.

ప్రకాశకులు
రామా అండ్ కో
H.O. ఏలూరు



V.S. GURU

# చందాదారులకు మనవి.

1952 సం॥ జులై నెలబాపతు ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య పత్రిక కారణాంతరములవల్ల ప్రచురించ జాలమైతిమి. సదరు జులై, ఆగష్టునెలల పత్రికలు కలిపి ఒకేసంపుటములో ప్రచురించి పంపుచున్నాము. కాన మనవి చేయడమైనది.

ఇట్లు,
రామా అండ్ కో.,
పబ్లిషర్సు : ఏలూరు.

ఏలూరు,
15-8-52.

# విషయసూచిక

# ఆంధ్రరాష్ట్ర

# ప్రారంభవిద్య

## విద్యావిషయిక మాసపత్రిక

సంపుటము 41] ఏలూరు, జూలై-ఆగష్టు 15 [సంచికలు 4-5





**వివరణము :**

ఆ పరమాత్మ మన యందఱిలో నున్నాడు. దానితో మనము సంకోచమును, వ్యాకోచమునుగూడ పొందవచ్చును. దివ్యదృష్టి లేకుండుట దౌర్భాగ్యమే. దాని నెవరును హరింపఁజాలరు. మన యంతరంగమునఁ బుట్టుచుండు చెడుభావములే దానిని హరింపవలెను. అవియే మన సహజశత్రువులు. మనల నవియే మోసగించును.

**సంకీర్తనము :**

హే విశ్వప్రకాశీ! నీ కాంతికిరణముల నాపై నొకింత ప్రసరింపనిమ్ము.
అన్నిటియందు వెలింగెడి నిన్ను గ్రహించుశక్తి నాకొసంగుము.
నా భావములు, ఒనర్చెడికర్మలు, నీయిచ్ఛ ననుసరించును గాక!
అన్నివిధముల నిన్నే నేననుసరించి నీ చెంతనే యుందునుగాక!

స్వామిరామతీర్థ.

ఖరసంవత్సరంలో

# రాలిపోయిన తారలూ ఆరిపోయిన జ్యోతులూ

రచన : శ్రీ శీలా వెంకటప్ప.

(గతసంచిక తరువాయి)

## ౭, శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ

శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ (బి. ఎ.) చెంగల్పట్టు జిల్లాలో 1891 సం. లో జన్మించింది. ఉన్నత విద్యను ఆర్జించి, శాఖాంతర వివాహంద్వారా డాక్టర్ ఆచంట లక్ష్మీపతిగారిని చేపట్టింది. వీరికి ఒక కుమారుడు, ఇరువురు కొమార్తెలు, గలరు. వీరందరును ఉన్నతపదవులను అలంకరించినారు.

1929 సం. నుండి కాంగ్రెస్ సభ్యురాలు. ముమ్మారు కృష్ణజన్మస్థానాన్ని వరించిన ధీరవనిత. 1930 లో ఉప్పుసత్యాగ్రహం చేసినప్పుడు ఏడాది శిక్ష విధించారు. 1932 లోను, 1940 లోను, సత్యాగ్రహంలో పాల్గొని రాజకీయ నేరస్తురాలుగా జైలుకు వెళ్ళడం, ప్రథమ భారతమహిళ ఈమెయే. (1930)

శ్రీమతి రుక్మిణీ తమిళనాడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సభ్యురాలుగను, ఉపాధ్యక్షురాలుగాను వుండినది, 1937 లో అఖిలభారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటి సభ్యురాలు. 1937, 1946 లో కాంగ్రెస్ టికెట్టుపై మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడింది. 1946 శ్రీ ప్రకాశం మంత్రివర్గంలో ఆరోగ్య శాఖామంత్రిణిగా పనిచేస్తూ, రాష్ట్రములో ప్రజారోగ్యంపట్ల అమితశ్రద్ధాసక్తులు కనబరిచింది. ఆయుర్వేద వైద్యాభివృద్ధికి విశేష కృషిచేసింది. ఈమె శ్రద్ధవల్లనే L. I. M స్కూలు కాలేజీగా ఆవిర్భవించింది.

అంతేగాకుండా గాంధిజీ నిర్మాణకార్యక్రమం పట్ల యెక్కువ శ్రద్ధ చూపేవారు. సాంఘిక, రాజకీయాల్లో అమితాసక్తిని ప్రదర్శించేది. అఖిల భారత మహిళా మండలి కార్యదర్శిగా పనిచేసింది. 1926 లో ప్యారిస్‌నగరములో జరిగిన ప్రపంచ మహిళా సభకు అధ్యక్షతవహించింది 1929 లో జరిగిన, అఖిల భారత మహిళాసభకుకూడ అధ్యక్షత వహించారు.

శ్రీమతి రుక్మిణి మద్రాస్, అణ్ణామలై, యూనివర్సిటీ సెనెట్ సభ్యురాలు. మదరాసు పురపాలక సంఘం, చెంగల్పట్టు జిల్లాబోర్డు సభ్యురాలుకూడ.

1939 లో జపాన్ ఆహ్వానంపై జపాన్, చైనాలను సందర్శించారు. ఇంటర్నేషనల్ ఫెలోషిప్ కార్యదర్శినిగా కొంతకాలం పనిచేశారు.

శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారి బహుముఖ ప్రతిభకు వివిధ శాఖలలో ఆమెకుగల ప్రవీణతకుఆమె అలంకరించిన పదవులేనిదర్శనం. మహదైశ్వర్యంలో జన్మించినా గాంధీజీ ప్రబోధములను తుచ. తప్పకుండా అమలులోనుంచింది. అందువల్లనే మద్రాసు మంత్రివర్గంలో మొదటమంత్రినిగా నియమింపబడిన గౌరవం దక్కింది. వీరు మద్రాసులో ది 6-8-61 న పరమపదించారు.

శ్రీమతి రుక్మిణమ్మగారి మరణంవల్ల దక్షిణభారత నారీలోకానికేకాక, యావద్భారతానికికూడ తీరని లోటు ఏర్పడింది" అని "ఆంధ్రప్రభ" యున్నూ, ఆంధ్రదేశపు ఝాన్సీని కోల్పోయినామని "ప్రజారాజ్యము" పత్రికయున్నూ, తమ సంతాపాన్ని ప్రకటించాయి.

మదరాసు అసెంబ్లీ సమావేశములో శ్రీ గోపాల రెడ్డిగారు ఆమెసేవాత్యాగాలను పొగడుతూ" నిరుపమానమైన సుస్మృతియేగాక నిష్కళంకమైన దేశభక్తిగల వీరవనిత" యని శ్లాఘించినారు.

## ౮. లియాకత్ ఆలీఖాన్

మిస్టర్ లియాకత్ ఆలీఖాన్ కొర్నల్ జిల్లాలో 1895 వ సం. జన్మించారు. ప్రథమములో ఆలీఘుర్, అల్హాబాద్, యూనివర్శిటీలలోను, ఆ తరువాత ఆక్స్‌ఫర్డుయూనివర్శిటీలోను, ఆయనవిద్యాభ్యాసం చేసారు. 1921 సం లో న్యాయవాదివృత్తిలో ప్రవేశించారు. 1922 లో ముస్లింలీగ్‌లో చేరాడు.

వీరికి యు.పి.లో ఒక జమీందారీ ఎస్టేట్ వున్నది. యు.పి రాజకీయాలలో వీరు ప్రముఖపాత్ర వహించారు. 1931 మొదలు 1936వరకు యు.పి కౌన్సిల్ కు ఉపాధ్యక్షుడుగా, కౌన్సిల్‌లోని డెమాక్రటిక్ పార్టీ నాయకుడుగ కూడ పనిచేశారు. ముస్లింలీగ్ పార్టీకి వుప నాయకుడుగా, కేంద్రశాసన సభాసభ్యుడుగా, వుండినారు. 1937సం. పూర్వంఇండో-బ్రిటన్ వాణిజ్య సంప్రదింపులలో వీరు ఒక సభ్యులుగా పనిచేసి, జాతీయ దృక్పథంలో చేసిన కృషి ప్రశంసనీయమైనది. 1937 సం. లక్నో ముస్లింలీగ్ కార్యదర్శిగా ఎన్నుకోబడిన నాటినుండి వీరు మిస్టర్ జిన్నాకు కుడిభుజంగా పనిచేశారు. 1943 కరాచీ ముస్లింలీగ్ సమావేశములో జిన్నా మాట్లాడుతూ "మిస్టర్ లియాకత్ ఆలీఖాన్, నాకు కుడిభుజ"మని ప్రకటించారు. పండిట్ నెహ్రూ నాయకత్వంక్రింద యేర్పడ్డ తాత్కాలిక ప్రభుత్వంలో మిస్టర్ లియాకత్ ఆలీఖాన్ ఆర్థికశాఖా మంత్రిగా నియమించబడి సమర్థనీయంగా నిర్వహించారు.

వీరు ఇండియా విభజనానంతరం పాకిస్థాన్ ప్రధానిగా, ముస్లింలీగ్ అధ్యక్షుడుగా, ఎన్నుకోబడి దాని పురోభివృద్ధికై చాలా పాటుపడినారు. వీరికి 1934 సం.లో వివాహమైనది.

మిస్టర్ లియాకత్ ఆలీఖాన్‌కు భార్య, ఇరువురు కొమారులు, గలరు. ఈయన ఎప్పుడూ మృదువుగా మర్యాదగా మాట్లాడేవారు. అట్టి వీరు ఒకబహిరంగ సమావేశములో వుపన్యసిస్తూ వుండగా ఒక హంతకునిచే తుపాకితో కాల్చబడినారు.

వీరి మరణవార్తవిని భారతప్రధాని పండిట్ నెహ్రూ పార్లమెంటులో మాట్లాడుతూ "పాకిస్థాన్ నాయకులలో ముందు వెనుకలు చూచేవ్యక్తి మటుమాయమైనాడు." అని తన విచారాన్ని ప్రకటించారు.

హిందూపత్రికకూడ వ్యాఖ్యానిస్తూ "ఇండియా పాకిస్థాన్‌లకు తీరని నష్టం" అని అన్నది.

## చీఫ్‌జస్టిస్ శ్రీహరిలాల్ కనియా

శ్రీహరిలాల్ కనియా 1890 సం.లో బొంబాయి రాష్ట్రములో జన్మించారు. వీరి పూర్తిపేరు "హరిలాల్ జెకియన్‌దాస్ కనియా" బొంబాయి యూనివర్సిటీలో ఉన్నత విద్యాభ్యాసంచేశారు. బొంబాయి నగరములో ప్రముఖ న్యాయవాదిగా కీర్తిప్రతిష్ఠలు ఆర్జించారు. బొంబాయి హైకోర్టు జడ్జిగా 11 సంవత్సరాలు పనిచేసి, ఆతర్వాత 1946 లో సుప్రీంకోర్టు జడ్జిగా నియమింపబడినారు. ఇండియా రిపబ్లిక్ గా అయిననాడు 1950 జనవరి 26 తేదీన వీరు సుప్రీంకోర్టు చీఫ్‌జస్టిస్ పదవి స్వీకరించి ప్రథమ గౌరవ హోదాలను పొందినారు.

ఇండియా న్యాయవిచారణలో అత్యున్నతమైన స్థానాన్ని పొందారు. న్యాయశాఖ స్వాతంత్ర్యాన్ని సర్వదా పోషించారు. వీరి తీర్పులు నిష్పాక్షికంగా న్యాయశాస్త్రప్రమాణంగా వుండడమే గాక సహేతుకంగా వుండేవి.

ప్రముఖ న్యాయవాదిగా, న్యాయశాస్త్రకోవిదుడుగా. స్వతంత్ర భారతంలో సుప్రీంకోర్టు చీఫ్‌జస్టిస్ పదవిని అలంకరించడంలో తొలి భారతీయుడుగా శ్రీహరిలాల్ కనియా. హృద్రోగంవల్ల 1951 వ సం. నవంబరు 6 వ తేదిరాత్రి 9-20 గంటలకు కాలధర్మం చెందినారు.

వీరిమరణంవల్ల న్యాయశాఖా స్వాతంత్ర్యానికి తీరనినష్టం వాటిల్లింది.

మద్రాస్ హైకోర్టు చీఫ్‌జస్టిస్ శ్రీరాజమన్నార్ వీరిమృతికి చింతిస్తూ "వీరిమృతివలన న్యాయశాఖా స్వాతంత్ర్యానికి - దేశం మొత్తానికి - తీరనిలోటు యేర్పడింది" అని వాపోయినారు.

## ౧౦. శ్రీ దేశబంధుగుప్త

శ్రీ దేశబంధుగుప్త ఢిల్లీ రాష్ట్రములో పానిపట్ నివాసి. ప్రఖ్యాత పత్రికా సంపాదకుడు, జాతీయ వాదిగాను, కాంగ్రెస్ భక్తుడుగాను, పేరుపొందినారు. తేజ్ పత్రిక, న్యూస్‌క్రానికల్, పత్రికల ఆధ్వర్యాన్ని స్వీకరించి యుండినారు. 1921 లో తొలిసారిగా సహాయ నిరాకరణోద్యమములో పాల్గొనడంద్వారా రాజకీయాలలో పాల్గొన్నారు. ఆతరువాత లజపతిరాయ్, తిలక్ నాయకత్వాన్ని, స్వీకరించినారు. వీరు శాసనోల్లంఘనం మున్నగు

అనేక జాతీయోద్యమాల్లో పాల్గొన్నారు. ఆర్య సమాజములో చెప్పుకొదగుపులనుకూడ స్వీకరించి యుండినారు.

లాలా దేశబంధు గుప్త పెక్కు సంవత్సరాలు రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడుగా పనిచేసినారు. తన స్వస్థలమైన పానిపట్ నియోజక వర్గంనుండి 1936 లో పంజాబు శాసనసభకు, ఆ తరువాత ఢిల్లీపార్లమెంటుకు, 1950 లో అఖిలభారత పత్రికా సంపాదకుల సభకున్నూ, ఎన్నికోబడినారు. ఈయన అధ్యక్షత క్రింద ఇండో-పాకిస్తాన్ సంయుక్త సమావేశం జరిగింది. పార్లమెంటులో "ప్రెస్‌బిల్లు"ను గట్టిగా ప్రతిఘటించారు. ఇండియాలో మిత్రరాజ్య సమితిఅధ్వర్యానజరిగే అనేక సంస్కృతీ కార్యకలాపాల్లో పాల్గొన్నారు. ఢిల్లీ రాష్ట్రస్వపరిపాలనకు ధీరోదాత్తంగా పోరాడారు.

సుప్రసిద్ధ 'పత్రికా సంపాదకుడు, స్వాతంత్ర్య పిపాసి అయిన శ్రీ గుప్త కలకత్తాలో జరిగే పత్రికా సంపాదకుల స్థాయిసంఘ సమావేశానికి పోతూ వుండగా ఘోరవిమాన ప్రమాదంలో 1951 సం. నవంబర్ 21 వ. తేదీ మృతిచెందారు. వీరు బహు కుటుంబీకులు,

వీరి మృతివల్ల భారత పత్రికా రచనకు, భారత స్వాతంత్ర్య సాధానికే తీరని నష్టంవాటిల్లింది.

వీరి మరణానికి ఇండియా ప్రధాని శ్రీ పండిట్ నెహ్రూ సంతాపం తెలుపుతూ "స్వాతంత్ర్యం కోసం పోరాటం సాగించిన శ్రీ దేసబంధుగుప్తవంటి మహావీరుడు ఢిల్లీలో మరొకడులేడు. ఆయనలేని లోపం పూరింపరానిది" అని అన్నారు.

శ్రీ దేవదాసుగాంధి; శ్రీ బి. యన్. రావ్‌కూడ వీరిమృతికి చింతిస్తూ" ఢిల్లీ స్వపరి పాలనకు నిర్భయంగా పోరాడిన వీరు"డనియు, ఆయన మరణం వల్ల ఢిల్లీకేకాక, పత్రికా రచనారంగంలో ఒక కాంతికిరణం అణగారి పోయిందనియు అన్నారు.

## ౧౧. అవనీంద్రనాథ్ టాగూర్

అవనీంద్రనాథ్ టాగూర్ బెంగాల్ రాష్ట్రములో రాదక్‌పూర్‌లో 1870 సం. లో జన్మించారు. వీరు విశ్వకవి. రవీంద్రనాథ్ టాగూర్ మేనల్లుడు. జగత్ప్రసిద్ధ శిల్పాచార్యుడేగాక ఉత్తమనటుడు, కథకుడుకూడ. వీరికి ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు, గలరు.

గురుదేవ్ రవీంద్రునికి విశ్వభారతి నిర్మాణములో కుడిభుజంగా పనిచేశారు. దీనికి కొంతకాలంపాటు అధ్యక్షులుగా వుండినారు అవనీంద్రనాథ్‌టాగోర్ నిరంతరం కళారంగములో నిమగ్నుడై వుండేవాడు. కళారంగములో వీరిసేవ నిరుపమానమైనది; అపూర్వమైనది. భారతీయ చిత్రకళారంగమునకు ప్రాణం పోసినది వీరే. పాశ్చాత్య, ప్రాచ్యకళలను బాగా ఆకళింపు చేసుకొన్నవారు. నవ్యప్రాథ వాలకు అనుగుణ్యముగా అజంతా, ఎల్లోరా, ఎలిఫెంటామున్నగు కళాక్షేత్రములనుండి ఎన్నోవిషయాలు సేకరించి; అధునాతనమైన చిత్రాలను సృష్టించారు. వీరిచిత్రాలలో ప్రాచ్య, పాశ్చాత్యుల-ముఖ్యంగా - చైనీస్, జాపనీస్, పారశీక సాంప్రదాయాలు అగుపడుతూ వుంటాయి. నవ్యచిత్రాలద్వారా నేటిమన చిత్రకారులు వీరికెంతయో ఋణపడియున్నారనుటలో అతిశయోక్తిలేదు.

హావెల్, రస్కిన్ వంటి పాశ్చాత్య చిత్రకారుల స్నేహము సంపాదించి, వారిమెప్పుపొందిన ప్రజ్ఞాశాలి అవనీంద్రనాథ్ టాగూరు.

అట్టి అవనీంద్రనాథ్‌టాగూర్ జగత్ప్రసిద్ధ శిల్పాచార్యుడుగా, ఉత్తమనటుడుగా. కథకుడుగా 1951 వ. సంలో డిశంబర్ 5 వ. తేదీ రాత్రి అస్తమించారు.

వీరి మరణాన్నిగూర్చి ఆంధ్రప్రభ వ్యాఖ్యానిస్తూ" ఆధునిక భారతనిర్మాతలలో ఒక మహామహుడు నేలకొరగడం దేశానికి తీరనినష్టం అని" వ్రాస్తూ అవనీంద్రటాగూర్ బహుముఖ ప్రాభవానికి జోహార్లర్పించింది.

## ౧౨. జోధ్‌పూర్ మహారాజా

రాజస్థాన్ రాజప్రముఖుని వయస్సు దాదాపు 30 సంవత్సరాలు ఉన్నతవిద్యను అభ్యసించారు. ఆస్థానములో లలితకళా విశారదులను నెలకొల్పి, కళోపాసకుడని పేరుపొందారు.

విశాల రాజస్థాన్ యేర్పర్చడంలో తోడ్పడి ప్రజాదరణ పొందారు. విమానచోదకత్వంలో ఆరితేరినదిట్ట. భారతవైమానికదళంలో గ్రూప్ కెప్టెన్‌గా గౌరవబిరుదు ఆర్జించారు. గురిచూచి కొట్టడంలో మహానిపుణుడు. చాలమంది సంగీత విద్వాంసులను పోషించారు. శాస్త్రసంబంధమైన సంగీతమంటే చెవికోసికొనేవారు. ఇంద్రజాల

మహేంద్రజాల విద్యలో చాల అభిలాషగలవారు గాన లండన్ ఇంద్రజాలకుల క్లబ్‌లోకూడ వీరికి సభ్యత్వం లభించింది.

ఇట్టి కళోపాసకుడు, ఉన్నత విద్యావేత్త, మహారాజు, స్వయముగా విమానమును నడుపుతూ ఘోరప్రమాదానికిలోనై 1952 జనవరి 25 వ తేదీన దుర్మరణం చెందారు.

వీరికి సోదరులు, భార్య, ఇరువురు కుమార్తెలు, ఆరేండ్ల కొమారుడు వున్నారు.

## ఆరవ జార్జిచక్రవర్తి

ఆరవజార్జి చక్రవర్తి బ్రిటిష్ సామ్రాజ్యానికి అధినేత. అయిదవజార్జికి, మేరీరాణికి, రెండవ పుత్రుడు. 1895 సంవత్సరం డిశెంబర్ 14 వ తేదీ జన్మించారు. వీరి ఉన్నతవిద్యాభ్యాసం కేంబ్రిడ్జి లోని ట్రినిటి కాలేజీలో జరిగింది. కొంతకాలం వీరు "ఆక్టివ్ సర్వీస్"లోను, తర్వాత కొంతకాలం వైమానికదళంలోను పనిచేశారు.

1923 ఏప్రెల్‌లో లేడీ ఎలిజబెత్‌ను వివాహ మాడినారు. ఇరువురు కుమార్తెలు, పెద్దకుమార్తె రాణి ఎలిజబెత్, చిన్నకుమార్తె మార్గరెట్. జార్జిరాజుకు టెన్నిస్, గోల్ఫ్, ఆటలంటే బహు ప్రీతి. సింహాసనాన్ని అధిష్ఠించేందుకు పూర్వం టోర్నమెంట్సులోపాల్గొనేవారు. గుఱ్ఱపుఆటలన్నా కూడ చాలా అభిలాష. అమెరికా, బ్రిటన్‌ల మధ్య సౌహార్ద్రం పెంపొందించారు. బ్రిటిష్ ప్రజల కష్టనష్టాల్లో స్వయంగా పాల్గొని ప్రజల ఆదరాభిమానాలు పొందినారు. తన సోదరుడు విండ్సర్ ప్రభువు రాజ్యపరిత్యాగం చేసినందువల్ల 1936 డిశెంబరు 11 వ తేదీన బ్రిటిష్ సింహాసనాన్ని అధిష్ఠించినారు.

వీరి పరిపాలన హయాంలో రెండు ముఖ్య సంఘటనలు జరిగాయి. ఒకటి రెండవ ప్రపంచ సంగ్రామము. రెండవది బ్రిటిష్ సామ్రాజ్యంనుండి తొలగిపోయి, ఇండియా స్వతంత్ర దేశంగా రూపొందినది. చరిత్రాత్మకమైన ఈ రెండు సంఘటనలలో కూడ బ్రిటిష్ సార్వభౌముడు ఆరవజార్జి తనప్రజలకు, ప్రభుత్వానికి, అండగానిలిచి, సాహసాన్ని, ఓరిమిని ఔదార్యాన్ని ప్రదర్శించి, నందువల్లనే కామన్ వెల్త్‌లోని ప్రజలందరి విశ్వాసాన్ని సహితం చూఱగొన్నారు.

ఆరవజార్జి చక్రవర్తి గతసంవత్సరం ఊపిరితిత్తులకు శస్త్రచికిత్స చేయించుకొన్నారు. చాలకాలం అనారోగ్యంతోబాధపడి ఇటీవల కోలుకొన్నాడు. నిరాడంబరతచేత, సేవాపరత్వంచేత, ప్రజానురాగాన్ని చూరగొన్న ఆరవజార్జి చక్రవర్తి 1952 వ సం. ఫిబ్రవరి 5వ తేదీ రాత్రి సుఖంగా నిద్రపోతూ ప్రశాంతంగా అసువులను బాశారు.

వీరి మృతినిగూర్చి ఇండియా పార్లమెంటులో ప్రధాని నెహ్రూ మాట్లాడుతూ "ప్రజాహృదయాన్ని చూరగొన్న జార్జిరాజు మృతివల్ల నాతోపాటు మీకుకూడ హృదయ విదారకంగా వుంటుందనటాని కెట్టి సందేహం లేదన్నారు.

బ్రిటిష్ ప్రధాని విన్‌స్టన్ చర్చిల్ బ్రాడ్‌కాస్టు చేస్తూ జార్జిరాజునుగూర్చి "మృత్యువుకు స్వాగతం పలికిన ధీరు"డని జోహార్లర్పించారు.

మెయిల్‌పత్రిక వీరి మరణవార్తపై వ్యాఖ్యానిస్తూ "బ్రిటిష్ ప్రజల కష్టనష్టాల్లో భాగస్వామ్యం పొందినందువల్ల వారి ఆదరాభిమానాల్ని పొందగలిగా"రన్నది.

## ౧౪. శ్రీమతి ఉన్నవలక్ష్మీబాయమ్మ

శ్రీమతి ఉన్నవలక్ష్మీబాయమ్మ గుంటూరు జిల్లా సత్తెనపల్లె తాలూకా "అమీనుబాద" గ్రామంలో 1882 సం. లో జన్మించారు. 1893 వ. సం. లో శ్రీమతి లక్ష్మీబాయమ్మ గారికినీ, శ్రీ ఉన్నవలక్ష్మీనారాయణగారికినీ, వివాహం జరిగింది. దాదాపు అర్ధశతాబ్దినుండి ఈమె అనేక సంస్కరణోద్యమాలలో పాల్గొంటూ పెక్కువితంతు వివాహాలను స్వయంగా జరిపిస్తూ వచ్చింది. అతర్వాత గుంటూరులోకూడ వితంతు శరణాలయాన్ని స్థాపించిచాలా కృషిచేసింది.

కొద్దికాలం రాజమండ్రిలోకూడ వీరేశలింగం వితంతు శరణాలయానికి ఆధ్వర్యంవహించి, తిరిగి గుంటూరువచ్చారు. ఈమె జీవిత హయాంలో దాదాపు 60 వితంతు వివాహాలను స్వయంగా జరిపించారు.

1921 నుండి ఈమె అనేక రాజకీయ కార్యక్రమాల్లో స్వయంగాపాల్గొంటు వచ్చింది. అప్పుడే వీరు కాంగ్రెసులో ప్రవేశించారు. 1930-31, 1942 లో జాతీయోద్యమాల సందర్భాల్లో కారాగార వాసం చేసారు.




బాలకవి : కోటసీతారామమూర్తి-టీచరు

("పెండ్లిచేసుకొని-యిల్లుచూచుకొని" అను పాటవరుస)

ఓ... నవ్యభారత భావిపౌరులారా!
బాల... బా... లికలారా!
మన భావిజీవితపు బ్రతుకు దెరువునకై
చదువుసేర్చుటకు-బడికిపోవుచును
చక్కని విద్యను నేర్వాలోయ్!
నిత్యము బడికి వెళ్ళాలోయ్!
గురుశిక్షణ నెప్పుడు పొందాలోయ్! ॥చదు॥
నిత్యకృత్యాలకై మనబాల్యదశ నే బలిగొని
అజ్ఞానులుగ జేయు పెద్దలు మేలుకొనగ
ప్రాథమిక-ఉన్నత-పాఠశా... ల... ల

కడు చక్కగా చదివి సత్కీర్తిగాంచ
భక్తిశ్రద్ధావినయంబులతో
బాగుగ చదువాలోయ్!
మార్గదర్శియగు మనగురునెపుడు
మన పాలిదైవముగ నెంచాలోయ్!
బాలభారత భావిపౌరులను
భవ్యనామమును బడయాలోయ్!
భావి పౌరులమై భారతీయుల
బాధలన్నిటిని బాపాలోయ్! ॥చదు॥

---

-3 వ పేజీ తరువాయి

1932 సం. లో వీరు "శారదానికేతనం" స్థాపించి స్త్రీజనాభ్యుదయానికై అహరహంకృషిచేసారు.

శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ఆంధ్ర దేశములో సంఘ సేవికలలో అగ్రగణ్యురాలు. భారతస్వాతంత్ర్య పోరాటములో నిరంతరం పోరు సల్పిన వీరనారి. ఆంధ్ర మహిళాభ్యుదయానికై తుదిక్షణం వరకు కృషిసల్పిన ఆంధ్రమాత. అట్టి ప్రసిద్ధ తెలుగు మహిళ పక్షవాతంతో బాధపడుతూ భర్తను, కుమారుని, విడిచి 29-2-52 తేదీన దివంగతు రాలయింది.

ఈమె మరణానికి శ్రీమతి భారతీదేవి రంగా చాల చింతిస్తూ నూర్లకొలది నోరులేని పిల్లలు తమ తల్లిని పోగొట్టుకొన్నారని వాపోయింది.

# ప్రావిడెంటు ఫండురూల్సు

(1952 జూన్ నెల తరువాయి)

తర్జుమాదారు: కొండ్రెడ్డి సూర్యప్రకాశం
టీచరు మేనేజరు, భారతీస్కూలు, కొర్లపాటివారిపాలెం.

గమనిక : మదరాసు విద్యానిబంధనల ప్రకారము 154వ సూత్రము ననుసరించి రద్దుచేయబడిన సర్టిఫికెట్లు గల ఉపాధ్యాయ యాజమాన్యులు లేక, రికగ్నిషను రూల్సు 1 చాప్టరు 2వ భాగము 14వ నిబంధన ప్రకారము టీచర్లుగాగాని, మేనేజర్లుగాగాని, లేక కరస్పాండెంట్లుగాగాని పనిచేయుటకు తగియుండలేదని నిర్ధారణ చేయబడినపుడు సూత్రార్థ ప్రకారము సర్వీసునుండి తప్పింపబడిరనిజే భావించవలెను. (అనగా పనినుండి బర్తరపు కాబడినవారి కెట్టి టి. పి. యఫ్. డిపాజిట్టు వచ్చునో వీరికిని అట్టి డిపాజిట్టు సొమ్ముమాత్రమే వచ్చునని అర్థము) ఇటువంటి సందర్భములో జిల్లావిద్యాశాఖాధికారి ఉద్యోగస్థుల డిపాజిట్లు లేక గవర్నమెంటు కంట్రిబ్యూషను ఆపుచేయు విషయమై మేనేజిమెంటుతో ఆలోచించవలసిన పనిలేదు.

(డి) స్వయంకృతాపరాధమగు తన స్వంత తప్పువలని ఒకచందాదారు సర్వీసునుండి తప్పింపబడినపుడు తన బాకీక్రింద రావలసిన యావత్తు నిలవ మొత్తములను పుచ్చుకొనగలుగును. మరిన్ని జిల్లా విద్యాశాఖాధికారి శాంక్షను చేసినచో ప్రభుత్వ కంట్రిబ్యూషను సొమ్ములుకూడ అందుకొనగలడు. లేక తిరిగి ఉద్యోగములో చేరినయెడలగూడ అట్లు చేరే వరకు లేక చేరినపిదప కంట్రిబ్యూషను కోరని పక్షములో యీ టి. పి. యఫ్. స్కీములో తిరిగి భాగస్వాముడు కావచ్చును. (అనగా తిరిగి చేరవచ్చును)

(ఇ) ఒక చందాదారు తన సర్వీసుకాలములో ఎప్పుడైనను ప్రభుత్వమువారివలన లేక ఇతర ఏజన్సీ వారివలన, పెన్షను లేక పింఛను యిచ్చి నడపబడు విద్యాలయములలో ఉద్యోగిగా చేరినపుడు (అనగా సర్వీసులో కొంతకాలము పింఛనీలేని విద్యాలయములో పనిచేసి పిదప పింఛనువున్న విద్యాలయములోనికి మారినపుడు) పింఛనీలేని సర్వీసుబోనే రివర్టు చేసి తీరవలెనను సరియగు కారణము లేనపుడు మాత్రము అతని అక్కౌంటు మూసివేయుచు, ఆయన బాకీకి రావలసిన అన్ని నిలవ మొత్తములను గవర్నమెంటు కంట్రిబ్యూషను సొమ్ములతోసహా ఆయనకు ఇచ్చివేయబడును.

## 11. దాచుకొన్న నిలవసొమ్ములు తిరిగి తీసుకొనుట.

(ఎ) ఒక చందాదారు తప్పనిసరిగా తానే నడిపి తీరవలసియున్న ఖర్చులనిమిత్త అనగా చందాదారు లేక అతని కుటుంబములోని మరియొకవ్యక్తికి జబ్బు చేసినపుడుగాని, పెండ్లిసంబంధమగు ఖర్చుల నిమిత్తము గాని, ఖననదహన సంస్కారాదుల నిమిత్తం గాని (మాసికములు, తద్దినములు, దినవారములు, సంవత్సరికములు) మున్నగు కార్యకరాదుల నిమిత్తం గాని, యిట్టి తృప్తికరమగు కారణములకుగాని, టి. పి. యఫ్. ఫండునుండి అడ్వాన్సులు తీసికొనుటకు ఆ జిల్లా విద్యాశాఖాధికారి లేక యిన్స్పెక్టరవ్ అంగీకరింపవచ్చును. కాని చందాదారుయొక్క బాకీ నిలవ మొత్తం, చందాదారుని ఆరునెలల జీతమును మించియున్నప్పుడే అట్టి అడ్వాన్సుసొమ్ములు అనుమతింపబడును. మరిన్ని ఒకేసారి శాంక్షనుచేయు సొమ్ము మొత్తము ఎప్పుడైనను చందాదారునియొక్క మూడు నెలలజీతము మొత్తమును మించియుండరాదు. చందాదారుని బాకీ నిలవ మొత్తం తేల్చవలసి వచ్చినపుడు తపాలాఫీసు ఐదుసంవత్సరముల రొఖ్ఖ సర్టిఫికెట్ల మొత్తము సొమ్మునుగూడ కలిపి లెక్కింప

వచ్చును. కాని అట్లు నిలవచేసినసొమ్ము మొత్తము ఏ మాత్రమునుగూడ అయిదుసంవత్సరముల కాలము ముగియకముందు తీసికొనరాదు. ఫండునుండి తీసికొనిన అడ్వాన్సులు 24 సమాన నెలలవారీ వాయిదాలమీద తిరిగి చెల్లింపబడవలసినదే. కాని ఒక చందాదారు ఏవిధమగు సెలవులోనున్ననుగూడ వాయిదా సొమ్ముకట్టి తీరవలెను. (అనగా వేరే వాయిదాలు ఉండవు.)

గమనిక:—కన్ఫైన్మెంటు విషయములో కావలసిన ఖర్చులు చేయుటకై అడ్వాన్సు యివ్వబడును. (1) చాలకాలము మందు పుచ్చుకొనుటకు అవసరమగు సందర్భములలోను, చాల కాలము ఆసుపత్రిలో ఉండవలసివచ్చినపుడును లేక వ్యాధిని కుదుర్చుకొనుటకు ఉండవలసిన పరిస్థితులలోను మరిన్ని (2) చందాదారుయొక్క రాబడికి మించిన అవసరమగు ఖర్చులు చేయవలసిన సందర్భములలోను.

(బి) జిల్లావిద్యాశాఖాధికారులు వారిచే శాంక్షను చేయబడినట్టి అడ్వాన్సులకొరకు అనుబంధము 'ఇ' లో చెప్పబడిన నమూనాప్రకారములో ఒక రిజిష్టరును నియమించియుంచవలెను. ఇదివరలో ఫండునుండి అడ్వాన్సుతీసుకొన్న సొమ్ము వాయిదా బాకీ తిరిగి చెల్లించవలసి యున్నపుడు ఫండునుండి క్రొత్త అడ్వాన్సుశాంక్షను చేయబడదు.

(సి) జిల్లా విద్యాశాఖాధికారిచే నియమింపబడిన కాలముకన్న తక్కువకాలములో అడ్వాన్సుసొమ్ము తిరిగి యిచ్చివేయుటకు చందాదారు యిష్టపడినచో తప్పక రిఫండు చేయవచ్చును.

(డి) శాంక్షను చేయబడిన అడ్వాన్సు సొమ్ములు తీసికొనుటకు అవసరమగు దరఖాస్తు చందాదారుచే సంతకముచేయబడవలెను. మరిన్ని స్కూలుగుమాస్తా లేక స్కూలు ప్యూను లేక స్కూలు మేనేజరు లేక కరస్పాండెంటుచే నియమింపబడిన యే యితర వ్యక్తి పేరనైనను వ్రాసి పంపవచ్చును. మరిన్ని జిల్లా విద్యాశాఖాధికారిచేత ఒరిజనల్ గా శాంక్షను చేయబడిన ఆర్డరుచే బలపర్చబడవలెను. (అనగా డి. ఇ. ఓ. గారి శాంక్షను ఆర్డరుకూడ జతపర్చవలెను.) స్కూలు మేనేజరు లేక కరస్పాండెంటు తాను సొమ్ము అందుకొనిని పిదప ఆ చందాదారుకు అక్విటెన్సు రోలు సంతకము తీసుకొని చెల్లించివేయును.

## 12. జీవితభీమాల కంపెనీల పోలసీలకు ప్రీమియములు చెల్లించుటకై టి. పి. యఫ్. ఫండునుండి సొమ్ము తీసుకొనుట.

(ఎ) ఒకచందాదారు తాను యిదివరలోనే చేరిన ఒక జీవితభీమా కంపెనీలోని పోలసీ సొమ్ము చెల్లించుటకు యిష్టపడినపుడు యీ ఫండునుండి సొమ్ము తీసికొనుటకుకూడ అంగీకరించబడును. కాని మేనేజరు వంతు మినహా చందాదారుయొక్క స్వంత కంట్రిబ్యూషను సొమ్ముకు మించినంతవరకుగల మొత్తమును మాత్రమే తీసుకొనటకు అంగీకరింపబడును. మరిన్ని ప్రీమియము సొమ్ము సాలీనా వాయిదా అయి యుండవలెను.

(బి) 1. చందాదారుయొక్క పోలసీ సంబంధమగు అన్ని విషయములు ముందుగా జిల్లా విద్యాశాఖాధికారికి లేక అధికారిణికి మనవి చేసికొని మరిన్ని "సరియగు భోగట్టా" అని వారు అనుమతించిన పిదప సదరు విషయమై ముందుగా యింటిమేషను వచ్చిననే తప్ప యెట్టి సొమ్మున్ను యీ ఫండునుండి తీసుకొన వీలులేదు.

చందాదారు తనస్వంతజీవిత భీమా విషయములోక ఒప్పుకొనదగిన పోలసీ అయియుండవలెను. (ఒక పురుష చందాదారుని పేర వ్రాయబడినట్టిన్ని, త భార్య-మరిన్ని బిడ్డలు-లేక వారిలో యెవరికైనను అన్ని" ముఖపత్రముపైని వ్రాయబడినట్టిన్ని, పోలసీ అయిననే తప్ప) మరిన్ని-గవర్నమెంటువారికి చందాదారు తన సంతకముతో సీగలుగా వ్రాయబడిన పోలసీ అయియుండవలెను.

(i.) అనుబంధము 'జి' లో చెప్పబడిన ప్రకారము పోలసీ చందాదారు సంతకముతో, గవర్నమెంటు పేరునవ్రాసి భద్రతకొరకు, జిల్లా విద్యాశాఖాధికారికి దాఖలు చేసుకొనవలెను. ఇన్సూరెన్సు కంపెనీవారికి చందాదారు పోలసీ అస్సైనుమెంటు నోటీసుయివ్వవలెను. ఆనోటీసు అందుకున్నట్లు ఇన్సూరెన్సు కంపెనీవారు తిరిగిపంపెడు రసీదు (ఎక్నాలెడ్జిమెంటు) జిల్లావిద్యాశాఖాధికారిలేక అధికారిణికి, ఎస్సైనుమెంటు తేదీనుంచి మూడు నెలలలోగా పంపించి వేయవలెను.

(iii) తీసుకొను సొమ్ముమొత్తము ప్రీమియము చెల్లించుటకు కావలసిన మొత్తముకంటె మించియుండరాదు. మరిన్ని ఆసొమ్ము రూపాయలలోనే ఉండవలెను (అణాలు, పైసలుండరాదు)

(iv) చందాదారుల తరపున ప్రీమియములు కట్టుటకై చెల్లించబడు సొమ్ములు విషయములో ప్రభుత్వము యెట్టిమొత్తములను చెల్లించదు. సరిగదా పోలసీ బ్రతికించుటకు తగిన కట్టుదిట్టములుగూడ చేయదు.

(v) పోలసీ చెల్లించుటకై డబ్బుతీయు సందర్భములలో చందాదారు ఎట్టి బోనసును పొందలేదు. పోలసీ షరతుల ప్రకారము తొందరలేకపోయినను, అందునిమిత్తముసొమ్ముతీయుటయును,మరియు చందాదారునియొక్క షరతుల క్రిందనున్న ఏబోనసు మొత్తమైనను ఉంచుటకు సొమ్ము తీయుసమయమునను, చందాదారుచేత ఫండులోనికి చెల్లించబడవలెను. లేక తప్పినవారి సందర్భములలో జిల్లావిద్యాశాఖాధికారిలేక అధికారిణివల్ల ఆర్డరువేయబడినపుడుచందాదారుయొక్క ఎమాల్యుమెంట్సునుండి తగ్గించడము మూలముగా వసూలు చేయబడును. ఈ వసూలు చేయుట, వాయిదాలమీదగాని, లేక యితరత్రా గాని; జిల్లా విద్యాశాఖాధికారి - లేక అధికారిణి-వారి ఉత్తరువుల ననుసరించి యుండును.

(సి) (i) టి. పి. యఫ్ ఫండునుండి సొమ్ము తీసికొనుటకు యిచ్ఛగలిగిన చందాదారు, లేక సొమ్ము తీసి జీవిత భీమా ప్రీమియము చెల్లించనిష్టపడిన చందాదారు, తాను పనిచేయుచున్న స్కూలు కరస్పాండెంటుద్వారా జిల్లా విద్యాశాఖాధికారిలేక అధికారిణికి-దరఖాస్తు చేయవలెను. ఈ దరఖాస్తు నియమిత తేదీకి అధమము ముప్పది రోజులుముందుగా చేయవలెను. ఈదరఖాస్తు అనుసంధము "హెచ్" లో చెప్పబడిన నమూనా ప్రకారము వ్రాయుచు సేవింగ్సుబ్యాంకు ప్యాసుబుక్కున్ను, ప్రీమియము నోటీసున్నూ, జతపరచి పంపవలెను.

(ii) జిల్లా విద్యాశాఖాధికారి-లేక అధికారిణి-దరఖాస్తు అందుకొన్నపిదప, దరఖాస్తులో వ్రాయబడిన మొత్తము విత్డ్రాచేసుకొనుటకు శాంక్షను ఆర్డరునిచ్చును. పిదప ఆకరస్పాండెంటు తపాలాఫీసునుండి ఆ మొత్తమును తీసి శాంక్షను ఆర్డరు ప్రకారము చందాదారునికి ఆ మొత్తమును చెల్లించి వేయును. మరియు ఫండునుండి తాత్కాలిక అడ్వాన్సు చెల్లింపుకు శాంక్షను చేయును.

(iii) ప్రీమియము చెల్లింపబడిన తక్షణమే, లేక సొమ్మునుతీసుకొనిన ముప్పది రోజులులోగా, చందాదారు ఇన్సూరెన్సు కంపెనీవారిచే జారీచేయించబడిన ప్రీమియము రసీదు కరస్పాండెంటుద్వారా, జిల్లా విద్యాశాఖాధికారి-లేక అధికారిణికి - ప్రొడ్యూసు చేయును.

(iv) జిల్లా విద్యాశాఖాధికారి-లేక అధికారిణి ప్రీమియము రసీదును తనిఖీచేసిన పిదప కరస్పాండెంటు ద్వారా చందాదారుకు వాపసు చేయును. "తనిఖీచేసి, తిరిగి పంపడమైనది. రాబడిపన్ను లేదు" అని వ్రాసి మరీపంపును. అనుబంధము 'ఐ' ప్రకారము తన ఆఫీసులో యీ కార్యముకొరకు నియమింపబడిన రిజిష్టరులోగూడ నోటుచేయును.

(డి) చందాదారు సర్వీసు పూర్తిగావదలి, తిరిగి చేర్చుకొనుటకుగాని, పోలసీ వాపసు చేయుడనిగాని, జిల్లా విద్యాశాఖాధికారి-లేక అధికారిణికి-దరఖాస్తు చేసినపుడు, చందాదారుపేరు మీద అనుబంధము 'జె'లో చెప్పబడిన, నియమించిన నమూనా ప్రకారము పోలసీని తిరిగి బ్రతికించి, ఇన్సూరెన్సు కంపెనీకి తెలియచేసిన, సంతకము చేయబడిన, తిరిగి బ్రతికించుడని కోరిన, నోటీసుతో చందాదారుకు పంపును.

## 13. ప్రభుత్వపు కంట్రిబ్యూషను సొమ్ములు చెల్లించుట:—

(ఎ) ఒక చందాదారు తన ఉద్యోగమును కొన్ని సందర్భములలో వదలివేసినపుడు, అనగా గవర్నమెంటు కంట్రిబ్యూషనుసొమ్ము పుచ్చుకొనుటకు అర్హత కలిగినపుడు, జిల్లావిద్యాశాఖాధికారి - లేక అధికారిణిచే మదరాసు అక్కౌంటెంటు జనరల్ వారికి, కంట్రిబ్యూషను సొమ్ము పొందుటకుగల హక్కునుగూర్చి తెలియజేయబడును, చందాదారు విడిచినస్కూలుయొక్క మేనేజరు - లేక కరస్పాండెంటుచేత గవర్నమెంటు కంట్రిబ్యూషను సొమ్ము చెల్లించుటకు అవసరముగుదరఖాస్తు వ్రాసిపంపబడును. దరఖాస్తు వ్రాసి ఆ జిల్లాయొక్క జిల్లావిద్యాశాఖాధికారిగారికి పంపబడును. ఆ దరఖాస్తుతోపాటు ఆ స్కూలుయొక్క మేనేజరు-లేక కరస్పాండెంటుచే సంతకము చేయబడినట్టి, రావలసిన మొత్తము తీసుకొనునట్టిన్ని, సొమ్మును తెలియజేయు అనుబంధము "యఫ్"లో చెప్పబడిన ఒకబిల్లును, చందాదారుని యొక్క ప్యాసుబుక్కులున్ను, తాను మొట్టమొదట ఫండులోచేరినపుడు జిల్లా విద్యాశాఖాధికారిచే మంజూరు చేయబడిన, ఫండులో చేరుటకుగల హక్కు సర్టిఫికెట్టున్నూ. చందాదారునివల్ల - లేక మేనేజిమెంటువల్ల-చెల్లింప బడవలసిన కంట్రిబ్యూషను

# ఉపాధ్యాయ సోదరులకు విజ్ఞప్తి

## విద్యార్థులకు రోడ్డురూల్సు బోధించుట అవసరము

### రోడ్డురూల్సు గమనింపకేని అపాయములు తప్పింపుడు

ప్రజలలో విజ్ఞానము పెంపొందినకొలది, విజ్ఞానశాస్త్రములు (సైన్సు) అధికముగ ప్రాముఖ్యము చెందుచున్న నూతన వాహనములు (వెహికిల్సు) కనిపెట్టబడుచున్నవి.

అందువలన ఎక్కువగా ముఖ్య నగరములలోను, పట్టణములలోను, తక్కువగా పల్లెలలోను, రోడ్ల మీద యంత్రవాహనములు నిరంతరము నడుపబడుచున్నవి. మానవునికంటె ఎక్కువ వేగములో యంత్ర సామర్థ్యమున పరిగెత్తు యంత్రవాహనముల అపాయములనుండియు, రోడ్డుమీద తరచు వచ్చుచుండెడి ఇతర అపాయములనుండియు మన విద్యార్థులను కాపాడు బాధ్యత ఉపాధ్యాయులమగు మనపైనగూడ గలదు.

అందుచేత విద్యార్థులు తమ గృహములనుండి పాఠశాలకును, బడి విడువగానే యిండ్లకును వచ్చుచు పోవుచుందురు. మార్గములలో విద్యార్థులు రోడ్డుమీద నడచిగాని, సైకిలు యున్నగువానిపైన గాని ప్రయాణము చేయుదురని యెరుంగుడు.

విద్యార్థులలో చాలమంది రోడ్డురూల్సు సరిగా గమనింపక అపాయములకు గురియగుచుందురు. ఇట్టి అపాయముల బారినుండి తప్పించుకొనుటకుగాను పిల్లలు రోడ్డురూల్సు నేర్చియుండుట మంచిది. టీచర్లు నేర్పుట చాల అవసరం, రోడ్డురూల్సు మాత్రమే గాక, ఇతర యంత్రములవలన గలుగు అపాయములు రాకుండ కాపాడుకొను విధము నేర్పుటగూడ ముఖ్యము.

### రోడ్డు రూల్సు

విద్యార్థీ!

1. రోడ్డుమీదను, మార్గముల మధ్యమందును, బాటలమధ్యను నిలబడి మాట్లాడరాదు. ఆడరాదు. రోడ్డు మార్జినులో ట్రాఫిక్కు అడ్డు లేనిచోట నిలబడవచ్చును. మాట్లాడవచ్చును. ఏ వైన ఆడవచ్చును.
2. రోడ్డుకు ఎడమప్రక్కనే ఎల్లప్పుడు నడువవలెను గాని కుడిప్రక్కను ఎన్నడును నడువరాదు.
3. రోడ్డుమీద నడచునప్పుడు నీ వెనకవైపుకు చూడనక్కరలేదు. వెనుకనుండివచ్చు వాహనముల వలన సాధారణముగా నీకు ప్రమాదము రానేరదు.
4. మరియు నీ ముందువైపునుండి నీ కెదురుగా ఏవి వచ్చుచున్నవో చూచుకొని వాటివలన అపాయము రాకుండ తప్పించుకొనుము.
5. యంత్రవాహనముల వెనుకగాని, ఇతరవాహనముల వెనుకగాని, నీ వెన్నడును నడచి వెళ్లుటకు ప్రయత్నింపకుము. అవి అకస్మాత్తుగా ఆగిపోయినచో నీవు వానిమీదపడి అపాయమునకు గురి యగుదువు.

---

[illegible]2 వ పేజీ తరువాయి

సొమ్ములకంటె, అవసరపు మొత్తములు చెల్లింపబడ లేదని తెలియజేయు సర్టిఫికెట్టులున్న, జతపర్చ వలెను. ఆసర్టిఫికెట్టులో రూల్సుప్రకారము గవర్న మెంటుకంట్రిబ్యూషను సొమ్ము పొందుటకు అర్హత గల పరిస్థితులలోనే, తమ సర్వీసును చందాదారు విడిచిపెట్టినట్లు గూడ వ్రాయబడియుండవలెను. మరిన్ని చందాదారుని దరఖాస్తులో యిట్లుగూడ వ్రాయబడవలెను. చందాదారు అపెండెక్సు 'ఏ' లో చెప్పబడిన ప్రకారము ఫండులో చేయుటకు డిక్లేరేషను గలదనియు, సేవింగ్సుబ్యాంకు అక్కౌంటులోని సొమ్ము, సరియగు వ్యక్తికి-లేక వ్యక్తులకు చెల్లింపబడినదనియు, మొదలగు అన్ని సరియగు కరస్పాండెన్సులతోను జతపరచి పంపవలెను.

([illegible] పత్రికలో)

6. రెండు వాహనములమధ్య నెన్నడును నడువకుము, రెండును దగ్గఱకు చేరుట తటస్థించినచో అవి నిన్ను నొక్కివేయగలవు.

7. రోడ్డుమీద ఎన్నడును పరుగెత్తుటకు ప్రయత్నించవలదు, అపాయము వచ్చును.

8. వాహనములతో సమానముగా పోవలెననిగాని, వానికంటె ముందుగాపోవలెననిగాని పరుగెత్తకుము.

9, సైకిలు వెనుకనుండు కేరియరు పట్టుకొని కదలిపోవుచున్న సైకిలుతో పరుగెత్తకుము. సైకిలు రైడరు బ్రేకువేసి దిగినచో నీకు దెబ్బతగులును.

10. రోడ్లమీద నడచునపుడు రోడ్డు మార్జినుగూడ విడిచి బాగా పల్లములో నెన్నడును నడువకు. రాళ్ళు, రప్పలు, ముండ్లు, చెటుపులు, పురుగు పుట్రలు నీ పాదములకు హానిచేయును.

11. దీపము లేకుండా కటిక చీకటిలో రోడ్డుమీద నెన్నడును నడువకుసుమా! లైటులేని సైకిలు మున్నగునవి వచ్చి నీమీద పడగలవు.

12. రోడ్డుమీద నిలచియున్న వాహనములముందుగాని, వెనుకగాని నీ వెన్నడును నిలబడవలదు. అవి అకస్మాత్తుగా కదలినచో హానికలుగును.

13. నిలబడియున్న లేక పోవుచున్న వాహనములను ముట్టవలదు.

14. పెట్రోలుతోనడచు యంత్రములవద్ద బయటగాని, లోపలగాని పొగ త్రాగరాదు. అగ్గిపుల్లలు వెలిగించరాదు. అగ్ని తేకూడదు,

15, తగినంత పనియున్నపుడే రోడ్డుమీద అడ్డముగా నడవవలెను. కాని నీ ఎడమవైపున బాగుగజూచి ఏ వాహనము లెంత దూరములోనుండి నీవైపునకు వచ్చుచున్నవో కనిపెట్టి అవి వచ్చులోగా నీవు రోడ్డు యివతలిప్రక్కనుండి అవతలిప్రక్కకు పోగలవో లేవో బాగుగా గమనించుకొని మరి దాటవలెను. "దాటలేక పోయెదవా అతడే వాహనము ఆపును" అని గర్వించినచో వాహనములు మీద పడగలవు.

16. ఒక సెంటరునుండి 3, 4, 5, 6 వైపులకుగూడ కొన్నిచోట్ల రోడ్లు పోవుచుండును. అనగా 3, 4, 5, 6 రోడ్లు వచ్చి ఒక్కచోట కలియుటకూడ గలదు. అట్టిచోట్ల ఒకప్రక్కనుండి మరియొక ప్రక్కకుగాని, ఒకరోడ్డునుండి మరియొక రోడ్డునుగాని నీవు మారవలసి వచ్చినచో ఎక్కువ జాగ్రత్త వహించవలెను. రోడ్డుమీద పాతిన బల్లమీద వ్రాసినప్రకారం గాని, రక్షకభటుని సంజ్ఞలప్రకారంగాని నీవు ప్రవర్తింపవలెను. అక్కడ "స్టాప్—లిసెన్—ప్రొసీడు" అనగా "ఆగు—విను—నడుము" అని యింగ్లీషులో వ్రాయబడియుండును. లేదా "మెయిన్‌రోడ్డు-ఎహెడ్ డెడ్‌స్లో" అనగా "ఎదుట-పెద్దరోడ్డు చాలానెమ్మదిసుమా" అని బల్లమీద వ్రాయబడియుండును.

కావున ఏవైపునుండి ఏ వాహనము ఎంతవేగముతో వచ్చుచున్నది గమనించి, ఏదియు రానపుడు గాని, చాలదూరములో నున్నపుడుగాని పోవలెను. (ఒకటి రెండు రోడ్లు చూచినచో లాభము లేదు. అన్ని రోడ్లవైపు చూచి మరీ పోవలెను.)

17. వాహనములుకదలికలోనుండగా ఎక్కరాదు. దిగరాదు, బండియిరుకుననో నేలమీదనోపడిపోవును.

18. ఒక సైకిలుమీద నీ వొక్కడవే ప్రయాణము చేయవలెను. నీవు త్రొక్కుచున్న సైకిలుమీద ఇంకొకరి నెక్కనీయకు. ఇంకొకరుత్రొక్కుచున్న సైకిలుమీద ముందుగాని, వెనుకగానినీవు ఎక్కవలదు (యిద్దరు పడిపోగలరు. యిద్దరికి అపాయము రాగలదు.)

19. ధూళి, దుమ్ము ఎగురగొట్టుకొనుచు పోవుచున్న మోటారుకార్లు మున్నగు వాహనముల వెనుకనే నీవు నడచివెళ్ళకు. కొంచెము ఆగి దుమ్ము తగ్గినపిదప బయలుదేరుము.

28, రోడ్డుమీదగల విద్యుచ్ఛక్తి స్తంభములనుగాని, తీగలనుగాని ఎన్నడును ముట్టకు. అందలి కరెంటు (శక్తి) ఒక్కక్షణములో ప్రాణము తీసివేయగలదు. స్తంభములపైకి ఎక్కవద్దు.

21 నీవు ఏ వాహనం స్వంతముగా నడుపుకొని పోదలచినను బెల్లు, హారన్, బ్రేకులు, లైటు మున్నగునవి యున్నవా? లేవా? ఉంటే ఆర్డరులో నున్నవా? అలంకారమునకున్నవా? పరీక్షించి మరీ బయలుదేరుము.

22. నీవు గడ్డిబొద్దుల బండ్లప్రక్కను గాని, పొడుగాటి వెదుళ్లు లేక కట్టెలు వేసిన ఎడ్లబండ్లు లేక

లారీలకు ముందు వెనుకలలో దగ్గరగాగాని నడువకూడదు. గడ్డిబొద్దు బోల్తా పడగలదు. లేక కట్టెలు నీకు తగులగలవుసుమా !

23. కొన్ని రోడ్లు వంతెనలు చాల ఎత్తులో నుండును. కొందరోడ్లుగూడ మెరక పల్లములలో నుండును. రోడ్డు పైభాగమునకు ఎక్కునపుడును, క్రిందిభాగమునకు దిగునపుడును, వాహనములు ఎక్కునపుడును, ఎక్కలేక వెనుకకు రాగలవు, దిగునపుడు అతివేగముగా వచ్చిపోగలవు. అచ్చోట అడ్డముగా నీవున్నచో నీకు ప్రమాదము వాటిల్లును. నీవే వాహనము అచ్చట నడపినచో చాలా జాగ్రత్తసుమా ! ఎవరిమీదనైనా పడగలవు. లేక నీవే పడిపోగలవు.

24. నీవె ఒకొనొకప్పుడు వాహనారూఢుడవై నడుపవలసి వచ్చినచో ప్రయాణముచేయు చెవిటి, కుంటి, గ్రుడ్డి, మూగ, జంతుజాలము మున్నగువాటిని కనిపెట్టి మరీ నడుపుము. లేనిచో నీకును, రోడ్డు మీద గలవారికినిగూడ ప్రమాదము వాటిల్లగలదు.

25. రోడ్డు సెంటర్లు, ఇరుకు సందులు, మలుపులు ఉన్నచోట నీ వాహనము జాగ్రత్తగా నడుపుము.

26. నీవు సైకిలుమీద పోవుచున్నచో దూరముగా నుండగానే ఒకసారి దగ్గరగ వచ్చినతరువాత మరియొక సారి గంట మ్రోగించుము.

27. రోడ్డు సెంటర్లలో నీవు వాహనముమీద పోవునపుడు నీవు ఏవైపునకు పోయేది రక్షకభటునికి లేక అచటగల మార్గస్థులకు సంజ్ఞచేయుము.

28. రెండుచేతులు విడిచిపెట్టి సైకిలు త్రొక్కకుము.

29. నీ సైకిలుకు 3లేక 4 పౌనులు లేక 12 వీసెలలోపుగనే బరువుకట్టుకొనుము. ఎక్కువకట్టినచో ప్రమాదము.

30. మదరాసు మున్నగు నగరములలో నడచుటకు ప్లాటుఫారములుండును. గాన రోడ్డుమీద నిలువుగా నడవనక్కరలేదు. ప్లాటుఫారములమీదనే నడచి వెళ్ళవచ్చును. వానిమీదికి వాహనములురానేరవు.

నోటు : పై రూల్సు అమలునడుపుము. వినినందువలనగాని, నేర్చుకొనినందువలనగాని కలుగుఉపయోగము ఆచరణలో పెట్టినపుడుమాత్రమే అని మరువవలదు.

కొర్రపాటివారిపాలెం, 24—6—1952. }

కొండ్రెడ్డి సూర్యప్రకాశం,
టీచరు మేనేజరు.

## * * పోవాలోయ్! పోవాలి! * *

రచన—బి. వి. రమణమూర్తి, విద్యార్థి—అంపోలు

లోకజ్ఞానము లేని బుద్ధులు
లంచాలడిగే దేశద్రోహులు
కరుణలేని ఉద్యోగస్థులు
పోవాలోయ్ ! పోవాలి. 1

మాష్టరుచేతి పేపరువ్వులు
లెక్కలుచేస్తే వచ్చేతప్పులు
లోకజ్ఞానము లేని చదువులు
పోవాలోయ్ ! పోవాలి. 2

ధైర్యములేని రక్షకభటులు
గొంతులుకోసే కమ్యూనిస్టులు
కులములనెత్తే దేశనాయకులు
పోవాలోయ్ ! పోవాలి. 3

మాటలు అమ్మేన్యాయవాదులు
మూటలుగట్టే దొంగవర్తకులు
నీతిలేని విద్యాధికారులు
పోవాలోయ్ ! పోవాలి. 4

పాపకర్మలు పరమతద్వేషులు
న్యాయము నిలుపని నల్లబజారులు
కూటికి చాలని కొత్తవిద్యలు
పోవాలోయ్ ! పోవాలి. 5

ప్రజాదరణలేని పరిపాలకులు
డాబులుకోసే బడాయికోరులు
కూడుగుడ్డలకు లేని బ్రతుకులు
పోవాలోయ్ ! పోవాలి. 6

# —→ అభాగ్యజీవి ←—

"చదువుకున్న పిల్ల. చక్కగా ఉంది. చురుకైనది. ఈడు జోడు కూడ బాగానే ఉంటుంది. నీ యభిప్రాయ మే"మని ఈశ్వరయ్య వెంకటేసును పలుకరించాడు. వెంకటేసు కొద్దిసేపు ఆలోచించి రెండుదినములలో ఏవిషయం తెలియజేస్తానన్నాడు. ఈ రెండుదినాలలోపల నిర్ధారణకు రాలేకపోయాడు. వెంకటేసు. పెండ్లినిగురించి ఇలా ఆలోచనలో వెంకటేసు పడినాడంటే ఆశ్చర్యపడవలసిన విషయం ఏమీ లేదు.

వెంకటేసు 1947 సం||ము హయ్యరుగ్రేడుపాసై యింటికి వచ్చినాడు. అప్పటినుంచి కుటుంబభారము అతనిపై బడినది. అతనికి తల్లితండ్రిగాక, మరొక చెల్లెలు కూడ గలదు. తల్లితండ్రులు వయసు మించినవారు. చెల్లెలు చిన్నది. కాబట్టి పోషణ భారము అతనిపై బడినది. అతను ఉద్యోగములో చేసిన మొదటిరోజుల్లో రు 36 లు జీతం అందుతూ ఉండేది. ఈ జీతంతోను, పిత్రార్జితము రెండెకరాలతోను, కాలక్షేపము చేస్తూ ఉండేవాడు. కొన్ని దినాలు యీలాగ సుఖవంతముగా జరిగినా తర్వాత కొన్ని కష్టాలకు గురియైనాడు. తల్లికి జబ్బు చేయగా ఆజబ్బు నివారణకై రెండువందలు బాకీ చేయవలసి వచ్చింది. దీనితో ఒక ఎకరం భూమి పోగొట్టుకొన్నాడు. వెంకటేసుకు మిగిలిందల్లా ఇంకొక ఎకరం మాత్రమే. దీనితో నలుగురిజీవితాలు గడపాలి. కష్టాలు తన్ను ఎదుర్కొంటూ రాగా, కష్టాలనివారణకై సంఘ ఐక్యతే తిరుగులేని జవాబని ఉపాధ్యాయ ఫెడరేషన్‌లో చేరి, జీతాల హెచ్చింపుకై కృషిచేసినాడు. తత్ఫలితముగా ఉపాధ్యాయుల జీతాలు కొంతవరకు పెంచబడినాయి. కాని యుద్ధపరిస్థితులలో వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయినాయి. కాని జీతం మాత్రము గొర్రెతోక వలె ఉండిపోయింది. తనజీతంతో కుటుంబభారం మోయలేకపోయాడు. విధిలేక రెండవ ఎకరం కూడ అమ్మివేసినాడు. ఈనాటికి తనకు తల్లితండ్రి చెల్లెలు, తప్ప మరే ఆస్తిలేదు. యిలాటప్పుడు తనకు వచ్చే 50 రూ. లతో ఎలా జీవించాలనే సమస్య ఉత్పన్నమైంది. పెండ్లి చేసుకుంటే తానెలా జీవించాలనే సమస్యే అతన్ని పీడిస్తూ వుంది. ఒకవైపు తల్లిదండ్రులు కొడుకు పెండ్లి చూడాలనే ఆవేదన పడుచున్నారు. కాని వెంకటేసుకు పెండ్లి విషయం రాగానే దిగాలున దిగులుపడుచున్నాడు. ప్రస్తుతపు కరువును గురించి ఆలోచించి నట్లైతే తను వివాహము చేసుకొనడమే తెలివితక్కువ యని తలంచుకొన్నాడు. ఏదో S. S. L. C కి కూర్చొని ప్యాసై సెకండరీగ్రేడుకు చేరుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

ఈ పరిస్థితులలోనే ఈశ్వరయ్య తనకొక శుభవార్త అందజేసినాడు. కాని పెట్టుకొన్న రెండు రోజులలో తానే నిర్ణయానికి రాలేకపోయాడు. ఈశ్వరయ్య వచ్చి "వెంకటేసు" పిల్లను చూతువుగాని పద ఆతర్వాత నీయిష్టం" అని చెప్పినాడు. సరేనని వెంకటేసు పిల్లను చూడను ప్రయాణమైనాడు. పెండ్లికూతురు గృహము చూడగనే అతనిలో ఒక ఉత్సాహము వెల్లివిరిసింది. ఆఇల్లును బట్టి ఆకుటుంబము మధ్యరకపు రైతు ఇల్లు అని తెలుస్తుంది. ఈయింటిలో వివాహము చేసుకొంటే తనకు కొత్తబాధ ఏమీ మీదపడదని నిర్ణయము చేసుకొన్నాడు.

పెండ్లికొడుకు, పెండ్లికూతురు, ఒకరిని ఒకరు చూచుకొనేందుకు సర్వసన్నాహాలు జరిగాయి. పెండ్లికూతురు పేరు పార్వతి. పార్వతిని చూడగనే చదువుకున్నదని తెలుస్తూవుంది. కోలమొగము, అంత ఎత్తూ లేదు. అంత పొట్టిగాదు. తనవలె సన్నముగా నాగరికత కలిగినవ్యక్తి. మొదటి చూపులోనే యిద్దరు ఏకీభవించారు. ఒకరిచే నొకరు ఆకర్షింపబడ్డారు. వెంటనే తన కష్టాలన్నీ మరచి, పార్వతిని వివాహము చేసుకొనేందుకు నిశ్చయించుకొన్నాడు. పార్వతి అభిప్రాయమేమో తన సన్నిహితులైన స్త్రీలద్వారా తెలుసుకొన్నాడు.

"పెండ్లికొడుకు నచ్చినాడా" అన్న ప్రశ్నకు "నచ్చలేదని ఎవరన్నారు? పెద్దలు ఎలా నిర్ణయం చేస్తారో చూస్తాం" అన్న పార్వతి జవాబు విని ఎంతో మురిసిపోయాడు. వెంకటేసు ఈజవాబుచే మంచి తెలివైన పిల్ల యని నిర్ణయం చేసుకొన్నాడు. తర్వాత ప్రీతితో వారిచ్చిన ఆతిథ్యమును ఆదరముతో స్వీకరించాడు. పెండ్లిపెద్దలకు తన సమ్మతిని తెలియజేసినాడు. రెండురోజుల తర్వాత పెండ్లికుమారుని ఇంటికి వచ్చి నిశ్చయం చేసుకుంటామని

# విద్యార్థుల సారస్వత సంఘము

బి. పి. రామచంద్రారెడ్డి, సెక్రటరీ – చదుం

విద్యార్థుల విజ్ఞానము విస్తరించుటకు ప్రజ్ఞ ప్రకాశించుటకు, ప్రతిభ పరిఢవిల్లుటకు, పాఠశాలలలో పాఠ్యవిషయములతో పాటు పలువిధములైన పాఠ్యేతరవిషయములను గూడ గమనింపవలెనని విద్యాధికారులు విధిగా విధించినారు. విద్యాధికులు వేయివిధముల వ్యక్త పరచుచున్నారు. తత్ఫలితముగా. కళాశాలలలో ఉన్నతపాఠశాలలలో కొంతవరకు పాఠ్యేతరవిషయకార్యములు కొనసాగుచున్నవి. కాని ప్రాథమికపాఠశాలలలో, సరికదా! చాలసంవత్సరములు సర్వీసు కలిగిన ప్రధానోపాధ్యాయులుగల ప్రాథమికోన్నత పాఠశాలలలో సైతము పాఠ్యేతరవిషయముల కంత ప్రాముఖ్యము నివ్వక, ప్రయత్నింపకపోవుట శోచనీయము.

'ఇష్టం లేనివానికి పడద్రోసి పంగనామాలు పెట్టినా దాసరి కాడన్నట్లు' యుపాధ్యాయులకు పాఠ్యేతరవిషయములపై నుత్సాహము కలిగినగాని, తగినకృషి సల్పరు. ఉత్సాహ ముదయించుటకు గాని, యుద్బోధితులౌటకుగాని, పాఠ్యేతరవిషయములలో నొక్కొక్కదాని ప్రాశస్త్యము, పాటించు పద్ధతి, ప్రయోజనములు, పూర్వాపర్యముగ, ఆమూలాగ్రముగ, అవగాహన చేసికొన

౧౦౧ పేజీ తరువాయి

పెండ్లికూతురువాండ్లు చెప్పినారు. అతను ఇంటికి వచ్చినప్పటినుంచి పార్వతిని గురించే ఆలోచించుచున్నాడు. ఆమెను పెండ్లాడి ఎన్నికష్టాలైన ఎదుర్కొనేందుకు నిశ్చయించుకొన్నాడు.

అదిగాక భార్యను T. S. L. C కి కూర్చోబెట్టి తాను S. S. L. C కి కూర్చొని, దాని ద్వారా అటు భార్యను ట్రైనింగు చదివిస్తూ, తాను సెకండరీగ్రేడు ప్యాసైతే యిద్దరిజీతం 120 లు దాక వస్తుంది. అప్పుడు కొంతవరకు జీవితం సుఖపడవచ్చునని వెంకటేసు పగటికలలు కనినాడు. పెండ్లినిశ్చయమునకు తహతహ పడసాగాడు.

పెండ్లికూతురువాండ్లు రెండురోజుల తర్వాత వచ్చినారు. తనదగ్గర డబ్బులేకపోయినా అప్పు తెచ్చి వారికి ఆతిథ్యము యిచ్చినాడు. వారు కూడ సంతోషముతో స్వీకరించారు. పెండ్లికూతురువారు గ్రామములోని కొందరి పెద్దలను వెంకటేసును గురించి అడిగారు. పెద్దలు వెంకటేసు చాల మంచివాడనియు, సాధుస్వభావము కలవాడనియు, పదిమందితో కలసి మెలసి తిరుగువాడనియు, శ్రద్ధగా చదువుచెప్పి ప్రజల ఆదరణను పొందినవాడనియు, అతనికి భూమి పుట్ర ఏమి లేదనియు, చెప్పినారు. భూమి లేదనేసరికి పెండ్లికూతురువాండ్లు ఒక అడుగు వెనుకకు వేసినారు. తిరిగి 5 రోజులకు వస్తామని చెప్పి వెళ్ళిపోయినారు. 5 రోజులైన తర్వాత వెంకటేసుకు భూమి ఏమీలేదు కాబట్టి పిల్లను యిచ్చుట సమ్మతిలేదని కబురంపినారు.

ఈవార్త వెంకటేసు చెవుల పడగానే హతాశుడైపోయాడు. తలపులనే తాటాకులతో జీవితమనే గుడిసెను నిర్మించుకొనేందుకు సర్వసన్నాహాలు చేస్తూ ఉన్నాడు. అకస్మాత్తుగా "నిరాశ" అనే నిప్పు ఆతాటియాకులపై బడి దహించి వేసింది. తాటాకులన్నీ కాలిపోయాయి. పొగ ఆకాశాన్నంతా ఆవరిస్తూవుంది. బ్రతుకనే గట్టుపై నిలబడి పైకి చూస్తూ అలా నిలబడిపోయాడు.

పార్వతి తన్ను మెచ్చుకొన్నదాయె. పార్వతి పెద్దలు తన్ను గురించి, గుణములో అందములో మెచ్చుకొన్నవారాయె. ఈడు జోడు బాగుంటుందని పెద్దలంతా నుడివిరి. కాని భూమి అనే ఒకరాక్షసి వీరిపెండ్లికి అడ్డుపడింది. వెంకటేసు పార్వతిని గురించి ఆలోచిస్తున్నాడు. పార్వతి తన్ను మెచ్చుకొన్నప్పుడు తల్లిదండ్రులను ఎందుకు ఎదిరించరాదని కాని ప్రస్తుత సమాజములో బిడ్డల వివాహములు తల్లిదండ్రుల యిష్టాయిష్టములపై ఆధారపడి ఉన్నదనేది తెలుసుకొన్నాడు. తనకు ఈశీఘ్రకాలములో యిలాంటి సంబంధము కుదరడం అసంభవమనేది తెలుసుకొన్నాడు. తిరిగి తల్లి, తండ్రి, చెల్లెలు, జ్ఞప్తికొచ్చారు. తనజీవితం వీరి పోషణకే వినియోగిస్తానంటూ "ఇక పెండ్లి చేసుకోన"ని తనలోనే తాను ప్రతిజ్ఞ చేసుకొన్నాడు. ప్రస్తుతపు కరువు పరిస్థితులలో ఒక బీదఉపాధ్యాయుడు యిలా నిర్ణయించుకోవడం అబ్బురంకాదు.

—"యం. సి."

వలెను. అందుకై అవధానముంచి ఆకర్షింతురేని, యొక పాఠ్యేతరవిషయమును గూర్చి ప్రస్తావింతు నీమాసములో. ముదముతో వన్నింతురని మనవి.

పాఠ్యేతరవిషయములు విద్యార్థులకు సంబంధించినవి గనుక ప్రతికార్యములు పాఠకులతోనే జరిపించవలెను. వారే ప్రధానపాత్రధారులు. ఉపాధ్యాయులు దర్శకులు మాత్రమే. కాని దర్శకత్వమెంత దొడ్డగా నుండునో ప్రదర్శనమంత ప్రఖ్యాతిదాయకముగా, ఫలితము లంత ప్రసిద్ధముగా, నుండును. ఈ పాఠ్యేతర విషయములు విద్యార్థుల సంఘములద్వారా, నానావిధనామములతో నెగడుచుండును. బాలభటసంఘము, రెడ్‌క్రాస్‌సంఘము క్రీడాసంఘము, నాటకసంఘము, పరపతిసంఘము, సారస్వతసంఘము మున్నగుసంఘములను సాధనములతో పాఠ్యేతరవిషయముల కార్యములు సాధింపనగు వానిలో సారస్వతసంఘసంస్థాపన, సక్రమ నిర్వహణములవలన సిద్ధించేసాఫల్యముల గూర్చి సంగ్రహముగ సాదృశ్య పరచెదను. సావధానముగా సుహృద్భావముతో నొక్కి నాసంకల్పమును సార్థకపరచండి.

## 1. సారస్వత సంఘమును సాగించు సుగమనము :—

సారస్వతసంఘము వారమున కొకసారి సమావేశమగునట్లు, వారములో నొక నిర్ణీత దినమున కడపటి రెండు పీరియడ్లు కార్యక్రమము జరుగునట్లు, నిర్ణయించవలెను. ఈ సంఘమున కొక సెక్రటరీ, అకౌంటరు, విద్యార్థులనుండి, విద్యార్థులచే నెన్నుకొనబడవలెను. ప్రజ్ఞావంతులుగ, పక్షపాతశూన్యులుగ, పలుకుబడి గలవారుగ నుండువారినే, తమ సంఘ నిర్వాహకులుగా నెన్నుకొనునట్లు బాలబాలికలకు బోధించవలెను. ఈ సంఘమునకు సామాన్య అధ్యక్షులు సాధారణముగా ప్రధానోపాధ్యాయులే యుండుట పరిపాటి. అంతియగాక ఒక్కొక్క సమావేశమున కొక్కొక్క సహోపాధ్యాయుని గాని, యితర విద్యాధికులను గాని, ప్రత్యేకాధ్యక్షులుగా, అంత్యోపన్యాస కర్తలుగా నాహ్వానించవలెను.

## 2. కార్యదర్శి కర్తవ్యము:-

చర్చనీయాంశములను విద్యావిషయకమైనవి, విజ్ఞానదాయకమైనవిగా నుండునట్లు ఉపాధ్యాయుల సలహాలను పొందుపరచి, ఒక్కొక్కవారమొక్కొక్క దానిని నియమించవలెను. ఉదాహరణముగా: దైవభక్తి, గురుభక్తి, ఐకమత్యము, గ్రంథాలయములు, గ్రామసేవ, అహింస, దేశసేవ, వార్తావాహినులు, ప్రపంచ నాగరికత, కరువు, మొదలగునవి. ఉపన్యాసకులను ప్రతి తరగతినుండి (6,7,8) విద్యార్థులను నిర్ణయించవలెను. పై విషయములను వార ప్రారంభముననే ప్రకటనార్థమై తరగతులకు సర్క్యులర్ పంపవలెను. సంఘ సమావేశ సమయమున అధ్యక్షులను ఆహ్వానించి, కార్యక్రమ పట్టిక సమర్పింపవలెను. నాటి కార్యక్రమము ఈ క్రింది పట్టిక ననుసరించి యుండవలెను.

(1) దైవప్రార్థన.
(2) అధ్యక్షుని తొలిపలుకులు.
(3) గత సమావేశ కార్యక్రమ నివేదికను చదువుట.
(4) నాటి చర్చనీయాంశమునుగూర్చి నియమింపబడినవారు ఉపన్యసించుట లేక వ్యాసపఠనము గావించుట.
(5) స్వతంత్రోపన్యాసకుల చర్చ.
(6) అధ్యక్షుని అంత్యోపన్యాసము.
(7) చందాల వసూలు విషయము.
(8) అధ్యక్షులకు అభివందనము లర్పించుట.
(9) మంగళగీతములతో సమావేశ సమాప్తి.
(10) విద్యార్థుల హాజరును గుర్తించుట

అచ్చట నే జరిగిన కాలాతీతమగుటచే ఆయా తరగతి పెద్దలు హాజరుగాని వారిని గుర్తించి తరువాత కార్యదర్శికి తెల్పవచ్చును.

విద్యార్థులందరు ఈసంఘసభ్యులే. కాల వ్యయముల స్థితిగతులనుబట్టి చందాలు చెల్లింపవలెను. అకౌంటరు చందాలను ప్రోగుచేసి, జమాఖర్చులను గుర్తించుచుండవలెను. ఈ సంఘమునకు ఖర్చులేవి యను సందేహము కల్గవచ్చు. ఆ పాఠశాలోపాధ్యాయుల నాహ్వానించినప్పుడు, లేక పరాయి పెద్దమనుష్యుల నాహ్వానించినపుడు, ఉచితరీతిని చంద్రునకొక నూలుపోగన్నట్లు సత్కరింపవలెను. మఱియు వార్తాపత్రికలు, బాలబాలికల విజ్ఞానపత్రికలు తెప్పించి చదువవచ్చును. అంతియగాక వార్షికోత్సవ సమయమున చేదోడు గావచ్చును.

## 3. ఈ సారస్వత సంఘముచే చదువరులు సాధించదగు సాఫల్యములు:—

విద్యార్థుల మనోభావములను సువ్యక్తపరచుశక్తి

# ఆదర్శ విద్యాగేయము

రచన :
ద్విభాష్యం వెంకటరావు-దుర్గాడ.

("పెళ్లికూతురు" లోని "ప్రేమే దైవమందు రెందువల్ల" అనుపాటవరుస)

చదువే మోక్ష మందు రెందువల్ల?
కీర్తినొసగు తెలివిపెరుగు నందువల్ల. 1
గురువులను పూజించు టెందువల్ల?
దేశసౌభాగ్యం కోరుచున్నందువల్ల. 2
చేతిపనుల ప్రోత్సహించు టెందువల్ల?
ప్రజల సుఖజీవితానికి బాట యగుటవల్ల 3
పెద్దలను గౌరవించు టెందువల్ల?
మనకు బుద్ధులను నేర్పుచున్నందువల్ల. 4

జాతి మతము లొక్కటందు రెందువల్ల?
ప్రజలు సర్వసమత కోరుచున్నందువల్ల. 5
పల్లెబ్రతుకే మంచిదందు రెందువల్ల?
వారు న్యాయ, ధర్మాల్ కలిగియున్నందువల్ల
కర్షకుని కొనియాడు టెందువల్ల?
కాయకష్టానికి ఓర్చుచున్నందువల్ల. 7
దేశమును కొనియాడు టెందువల్ల?
మన కోర్కెలకు కామధేను వగుటవల్ల. 8

---

౧౦౩ వ పేజీ తరువాయి

కల్గుట కిదియొక సాధనము. ఊహాగానము చేయుటకు వసంత వనమువంటిది. వక్తృత్వమును వర్ధిల్ల చేయుటకు వాయు యానము. చదువరులలోని సభాకంపమును సడలింప చేయుటకు సిద్ధహస్తము. స్వాతంత్ర్యేచ్ఛా సౌధము నారోహించుటకు సోపాన పంక్తి, ఐకమత్యమును అభివృద్ధి నొందించు అపూర్వ ఆయుధము. పరస్పర ప్రేమామృతమును పుణికించు పుష్పలతి. వేయేల విద్యాలయ విఖ్యాతిని విస్తరింప చేయు విజయభేరి.

## 4. అవరోధక అఘాతములు:—

అసమర్థుడైన కార్యదర్శిని, స్వార్థపరుడైన అకౌంటరును, నెన్నుకొనుట, కార్య నిర్వాహణ భంగమునకు నాందియగును. శక్తికిమించిన చందాలు విధించి సతాయించుట, విద్యార్థుల నిరుత్సాహమునకు దారి తీయును. అధ్యాపకుల అనైక్యతవలన కల్గుతాటస్థ్యభావము, ఆహ్వానముల అంగీకరింపక, అలక్ష్యముచేసే అనాదరణ కల్గును. ఈ పరస్పర పరపతిని పెంపొందించువారిలో ప్రధానోపాధ్యాయులు ప్రముఖ పాత్ర నిర్వహింపవలెను. అన్ని అరిష్టములను అదుకొనవలసినది యొక ప్రధాన పంతులేనా యను ప్రశ్న బయలుదేరవచ్చు. పాఠశాల పరిపాలన కార్యక్రమావళిలో నిర్విరామమైన ప్రధానపంతులు సమర్థుడగు సహాయోపాధ్యాయు నొకనిని సదరు సంఘాధ్యక్షునిగా నియమించి, పరిచూచుచుండుట సరికాదా - విద్యాలయ నియమావళికి విరుద్ధము కాకున్న సహాయోపాధ్యాయుని సహాయ్యముకోరి నిర్వహింపుమని నిర్ణయించుటయే సబబు. తన కుతూహలము లేకపోగా, యితరుల నిర్వర్తింపనీయక, పిల్లల సదవకాశమును సద్వినియోగము చేయనీయక, సంవత్సరములో రెండో మూడో సమావేశములు జరిపించి రిపోర్టులు మాత్రము పంపుకొనుచుండుట ప్రధానోపాధ్యాయులకు పాడికాదు. ఎనిమిదవ తరగతి పబ్లిక్ పరీక్షకు సిద్ధముచేయు నెపముతో ఆ తరగతి విద్యార్థులను సమావేశములకు నిలుపుదలచేసి, తత్కాలములో పాఠములైనను చెప్పక, వారిని వ్యర్థపుచ్చుచుండుట సర్వజన విదితమే. కాని సారస్వత సంఘములో చర్చించిన విషయములు పబ్లిక్ పరీక్షా పత్రములలో వ్యాసముల రూపమున ప్రశ్నలు ప్రత్యక్షమగుచుండుట ప్రతి సంవత్సరము పరికించుచున్నప్పటికిని ప్రధానోపాధ్యాయులు తమ పొరపాట్లను గ్రహింపకుండుట గర్హనీయమగునేమో! విద్యార్థులు తమ స్వాతంత్ర్యభావములను బహిరంగ పరచే వక్తలై మన భాగోతములను భగ్నపరచుదురని భయమొంది, సభ్యులచందాలను దిగమ్రింగి, సమావేశముల సక్రమముగ సాగనివ్వక, మానవ్రతము లోని దిష్టిబొమ్మలుగా బాలబాలికలను తయారుచేయుడము బడిపెద్దలకు భావ్యముకాదు. అట్టివారి అడుగుజాడల అనుసరించు అధ్యాపకులుకూడ అభివృద్ధి కాముకులు కానేరరు.

సత్యముచెప్పి, సత్ఫలితము సాధింప సంకల్పించిన మీ యీ సోదరోపాధ్యాయుని సాహసమును క్షమించండి!

# ప్రభుత్వపు ఫర్మానా - ఉచిత విద్యా సౌకర్యము

## ది 31-5-1952 తేదీగల నెం 1250 రు ఎడ్యుకేషనల్ జి. ఒ.

పై జి. ఒ. ప్రకారము చిరకాలము నుండి, ఉపాధ్యాయుల బిడ్డలకు ఉచిత ఉన్నతవిద్య సక్రమాందోళన చేయుచున్న ఉపాధ్యాయులకేకాక, రు 300-0-0 లు లోపు జీతములు గల అన్నిశాఖల ఉద్యోగస్థుల బిడ్డలకునుగూడ 1; 2, 3 ఫారములకు పూర్తిగా జీతములు లేకుండాచేసిరి. 4, 5, 6 ఫారములకు సగము జీతము తగ్గించిరి. నూతన మంత్రివర్గము ప్రారంభమైన వెంటనే టీచర్లకును, యితర ఉద్యోగస్థులకును, యీ సౌకర్యమును కలుగజేసినందుకు మిగుల ఆనందించుచున్నారు.

పై సౌకర్యములతోబాటు ఆహారధాన్యాదులపై కంట్రోలు, రేషను, రద్దుపరచినందుకు ప్రజలును టీచర్లును చాలా సంతోషించిరి.

కాబట్టి అన్నిబాపతుల స్కూళ్ళటీచర్లును వెనువెంటనే యీ దిగువ నమూనాలో ఒకదరఖాస్తును పూరించి, ఆయా సెకండరీస్కూళ్ళ ప్రధానోపాధ్యాయులకు అడ్మిషను ఫారములతోబాటు పుట్టినతేదీ ధ్రువపత్రముతోబాటు, టి సి. లేక రికార్డుషీటు వగైరాలతో బాటు అందజేసుకొనుడు.

### నమూనా ఫారము

షరా :- సదరునమూనా ఇంగ్లీషులో వ్రాత ప్రతి, లేక టైపుకాపీ లేక తెనుగులో వ్రాత ప్రతి, లేక అచ్చుకాగితంలో, నుండవలెను. అదిలేనిదే జీతము కన్సెషను ఎవరికైనను ఒప్పుకొనరు.

ది 31-5-1952 సం॥రం తేదీగల ఎడ్యుకేషనల్ జి. ఒ. నెం 1250 ప్రకారం వ్రాసుకోవలసిన దరఖాస్తు నమూనా.

I (ఎ) విద్యార్థిపూర్తిపేరు. (బి) ఎన్నవఫారము.
(సి) జీతము సదుపాయమేదైన వేరేపొందుచున్నారా ?

II (1) తల్లి లేక తండ్రిపూర్తిపేరు. (2) పైవారిఉద్యోగము.
(3) తల్లిలేక తండ్రి పనిచేయుపాఠశాల లేక కచేరీపేరు.
(4) పైస్కూలు, లేక కచేరీ, స్టేటుగవర్నమెంటా ? కేంద్రప్రభుత్వమా ? ఇతరమేనేజిమెంటా ?
(5) పనిచేయు ఉద్యోగము తాత్కాలికమా ? ఖాయమా ?
(6) కులము. (7) అన్నికలిపి నెల 1 కి జీతము.

### ధ్రువపత్రిక

జీతసదుపాయము పొందుచున్నవిద్యార్థి నాజనకపుత్రుడు లేక పుత్రికయనియు, దత్తతపుత్రుడు లేక పుత్రికకాదనియు, నేను యిందుమూలముగా ధ్రువపరచుచున్నాను. మరిన్నిపై అధికారులు జీతం సదుపాయము చేయుటకు ఏకారణములచేతనైన అంగీకరించక పోయినచో పాలీసాపది నెలల జీతము నేను చెల్లించగలవాడను.

విద్యార్థిసంతకం. తల్లి లేక తండ్రిసంతకం. హోదా. తేదీ.

పైన చెప్పబడిన ఆఫీసులో స్కూలులో లేక కచేరీలో

యీదరఖాస్తుదారు పనిచేయుచున్నారనియు, పైన 2 వ భాగములో వ్రాసిన విషయములన్ని నిజమనియు, నేను సర్టిఫైచేయుచున్నాను.

పైఅధికారి సంతకం
అనగా రేంజిడిప్యూటీ
ఇనస్పెక్టరు సంతకం

స్కూలులేక కచేరీయజమాని
లేక స్కూలుమేనేజరు సంతకం

షరా :- ఇచట కచేరీ పేరు తేదీగల రబ్బరుస్టాంపుముద్ర వేయబడవలెను.

ఎన్నవఫారములో చేర్చుకొనబడెను ?
సగము జీతమేచెల్లించవలెనా ?
అసలు జీతమేచెల్లించనక్కరలేదా ?

తర్జుమాదారు,
కొండ్రెడ్డి సూర్యప్రకాశం.

# ప్రబోధము

(ప్రధానోపాధ్యాయులకు ప్రత్యేకము)

రచన : బి. పి. రామచంద్రారెడ్డి, కార్యదర్శి—చదుం

గురుద్రోహి
గర్భశత్రువు
గర్వితుడు
గరదుడు
గోముఖుడు
ఘాతకుడు'
మున్నగుముసుళ్లు
మూలమూలలను
మారుమ్రోగగ
ముఖాముఖి
ఉప్పొంగుచుండ,
మేదకుడైన
రఘురామయ్య
మొఱకులభంగి
మారుమొరగక
మానిమాడ్కి
ముదమునబోవు.
ఈఅపనిందలు
ఇంటయింట
ఇసుళ్ళలాగు
ఇట్టలముచేయు;
ఇంద్రజాలకుడు
ఇంద్రలుప్తకుడగు
చిదంబరయ్యయె.
కారణమేమన:
కచ్చుపోతగు
కచ్చుగుదియగు

చిదంబరయ్య
కరుణామయుడు
కర్మఠుడునగు
రఘురామయ్యపై
కనుకుట్టుకలిగి
కుశాగ్రబుద్ధిని
కీకటునిగా
కృతకర్ముని
కింపాకునిగా
కొండెములాడు
కొమ్ముపట్టెనా
కొండీయుడు.
అందులోగల
అంతర్యమేమన
ఆయూరిబడి
అధ్యాపకులలో
అంతర్భేదములు
ఆవిర్భవించి
అల్లనల్లన
అధికారమును
ఆయపరచుటకే

2

పూర్వగాథయిది :
చిదంబరయ్య
రఘురామయ్య
సహపాఠకులై
వేమనపంతులకు
ప్రియశిష్యులయి
పఠించినరోజులు
పోయాయి
ఉపాధ్యాయవృత్తిని
ఉపకరించుకొని
ఉన్నయూరి
విద్యాలయములో
పనిచేయగోరిన
ప్రియశిష్యులకు
ప్రయత్నముతో
పదవీప్రాప్తిని
ప్రతిష్ఠించెను
ప్రియతమగురువు
చిదంబరయ్య
ప్రథమసహాయుడై
రఘురామయ్య
ద్వితీయసహాకారై
దినములు దొర్లెను
రెండుయేళ్ళకే
రామయ్యగారి
బోధనాప్రజ్ఞచే
వ్యాయామక్రీడల
వెల్లువలచే
నాటకకళలో
నేరిమిచే
వార్షికోత్సవ
విఖ్యాతులచే

పాఠశాల ఒక
ప్రభాత ప్రభగా
ప్రకాశించెను.
బడిబాగులు
భళిరాయని
బాకాలూదెను
జిల్లాయంతట
ఆయశః కాంతికి
ఆరాధకుడగు
అధ్యాపకరఘు
అధికారుల
అభిమానమొంది
ప్రస్తుతపు
ప్రధానపంతులు
విరతుడు కాగన
ప్రధానపదవిని
పొందకపోవునే ?
అభివృద్ధికాముని
అభినందింతురె
అభిఘాతకులు?
అపనిందలను
ఆరోపింపక
అన్నము తిందురె?

* * *

అధ్యాపకులలో
ఆదర్శుడయి
అలరారుచున్న,
ప్రధానపంతుల
ప్రాపుపొంది
ప్రాశస్త్యమును
పొందుచుండెడు,
విద్యార్థులకు
విజ్ఞానజ్యోతియై
విభ్రాజితమగు,
గ్రామస్థులలో
గౌరవభాజనుడై
గణుతికెక్కిన
రఘురామయ్యను
హెడ్ మాస్టరుకు
పాలింతకాడుగ
హెచ్చరిక జేసి
పాఠశాలనుండి
పారద్రోలించి
ప్రముఖస్థానము
పోషించుకొని
ప్రకంపనుడై
ప్రధానగురువుల
పెకలించి
ప్రత్యామ్నాయించి
ప్రధానవృత్తము
పరివేష్టించే
ప్రయత్నశతము
పరగజేసెనా
కృతఘ్నుడగు
చిదంబరయ్య

* * *

సంవత్సరాదిలో
ఉపాధ్యాయుల
కేంద్రసంఘము
సమావేశమాయె;
కార్యదర్శియగు
వేమనపంతులు
బడిపనులచే
తీరికలేక
సదరుసంఘ
కార్యక్రమము
కుంటువార్చుటచే
రఘురామయ్యను
విప
అధికా
అందజేయ
అంగీకరించెను;
మీదుమిక్కిలి
ముఖ్యమాఖుడు
మిత్రుడగుటకు
మోదమొందెను.
కాని ... ...
చపలకారియగు
చిదంబరయ్య
చరచరలాడుచు
చీదరించుచు
'గురువులుండగా
శిష్యులాపట్టము
చేబట్టుట
చెనటికాదా?
ముందటివారే
మాకుండాలని
ప్రతిఘటించెను;
గురుశిష్యులకు
ఎన్నికలు జరుగగ
రఘురామయ్య
జయముపొందెను.
వేసారియున్నను
వలదనుచున్నను
వకాలతపూని
పంతులుగారికి
పురిరెక్కించి
రొంపిద్రొక్కించి

...రయ్య
...త
...ండీ
...కులలో
...జాతీయులు
విజాతీయులు;
హాయ్యర్ గ్రేడు
సెకండరీ గ్రేడులు;
స్వగ్రామస్థులు
పరస్థలస్థులను
విభేదములు
విజృంభించెను;
ప్రధానపంతులు
పసలగాను
పులి పంజెరగ
పరిణమించెను;
పంతుళ్ల పాలిట
పాఠశాల ఒక
పాపాలయమయ్యె;
కేంద్రోపాధ్యాయ
సంఘము ఒక
కురుక్షేత్రమయ్యె;
విద్యాబోధకుల
వఱపు వృధికై
వాడవాడల
వ్యాపించిపోయె;
అనామక లేఖలు

...లై
...తను
...రులకు
అంద జేసెను.
అధికారుల వెంట నె
అందులకరు దెంచి
ఉపాధ్యాయులలోని
అంతర్భేదములను
అచరితములను
అవలోకించి
ప్రధానగురువు
పటువుదప్పిన
పక్షపాతియని
ప్రధానపదవికి
పనికిరాడని
పరిగణించిరి
ఫలితమేమన:
ప్రధానగురువును
పెడమరించిరి;
రాజుల్లు మండిన
రఘురామయ్యను
రెల్లుగడ్డకు
రాలగొట్టిరి;
చిదంబరయ్య
చెనటిచేష్టలు
చిల్లివడవయ్యె,
సరికదా!
...త్తనమును
ప్రచ్ఛాదించిరి;
విద్యాలయములో
...జ్ఞానజ్యోతి
విగతమయ్యెను;
విఖ్యాతపు వెలుగు

వీగిపోయెను.
వంచితుడైన
వేసునపంతులు
వల్లకాడుగా
వయస్సుకి
వంగి వెఱచుచు
ఉద్యోగమును
ఉపచరింప
వలసి వచ్చెను.
ఉత్తమసోమకుని
ఉత్తలపాటుతో
ఉదాసించి
ఉజ్జగించితినని
ఉమ్మలించెను.

* *

ఎవడు ద్రోహియో
ఎవడు దివ్యుడో
ఎగతాళిచేయు
వెఱ్ఱిబాగులకు
ఎఱుకపడదా?
నిలకడమీదనే
నిజము తేలును.
పక్షపాతమును
ప్రల్లదనమును
ప్రకోపమును
పరాధీనతను
పాటించుచు
పాఠశాలను
పతనముచేయు
ప్రధానగురులకే
పవిత్రగాన
ప్రబోధముకాదా!

( ఊహాపోహాలు )

# వయోజనవిద్య - ఉపాధ్యా

శ్రీ కె. వి. సూర్యనారాయణరాజు – ఉ

విద్య మానవుని అజ్ఞాన తిమిరమునుఁబాపి, జ్ఞాన దీప్తినొసంగు కరదీపిక వంటిదనియు, వివేక ప్రదాయినియనియు, జీవిత పథానుసంధానగామియనియు, దెలిపెడిని. అట్టి విద్యను మానవ జీవితమున నేర్వదగు సువర్ణకాలము బాల్యము. బాల్యమునందు విద్యోత్పాతిక కేంద్రము వృద్ధిపొందుచు, పరిసరముల సహాయానుభవములతో శీఘ్రముగా వృద్ధిపొంది, మానవోన్నతికి దగిన జ్ఞాన దోహదము నిచ్చును. సుమారు ముప్పది ఐదు. సంవత్సరములవరకు జ్ఞాపక శక్తివృద్ధిపొంది, తరువాత వృద్ధిపొందక నిలిచి క్రమక్రమముగా తగ్గుచుండును. సులభముగా గ్రహించి జ్ఞాపక ముంచుకొనుటకు తగిన కాలము బాల్యము. తొలి, మలి, యౌవనదశలు మానవ జీవితమున హద్దుగా నేర్పడినవి. అందుచేతనే విద్యాభ్యాస యుక్తమగు కాలమును బాల్యము అనివార్య కారణముల వల్ల బాల్యమున విద్య నేర్వనివాడు యౌవనకాలమును, తగియున్నవి.

బాల్యముదాటి విద్య నేర్చు విధానమును "వయోజనవిద్యావిధాన" మందురు. పూర్వము నుండియు మనదేశము వ్యావసాయిక దేశమగుటచేతను, మిగిలిన వారుకూడా యెక్కువభాగము వ్యవసాయ సంబంధమగు వృత్తులుచేసి జీవించువారగుటచేతను, చాల మంది తమ బాల బాలికలను విద్యాబీజములు నాటుటకనువైన బాల్యమునుండియు బడులకుఁబంపక తమకు చేసాయముగా సుంకురని పశువుల కాపరులుగనో లేక అన్నపు చిక్కములు తెచ్చువారిగనో, చేయుట జరుగుచున్నది. అట్టి స్వల్పసహాయము బాలబాలికలవలన తామాశించి యేదో స్వల్పఆదాయము కుటుంబమునకు కల్గునను ఆశతో బాలుర విద్యాభ్యాసమున కడ్డు దగులుచున్నారు. అట్టి బాలురే విద్యాశూన్యులై పెరిగి పెద్దవారగుచున్నారుగదా!

పెద్దలై తమకువిద్యలేమి గొప్పలోటుగా గుర్తించి విద్య నేర్వమికి చాల వగఁజెందుచున్నారు.

విద్యయన విశాలార్థమున జూచిన మానవ జీవితమునకు పనికివచ్చు కృషికి దోహదమిచ్చు భావజనిత సన్నివేశపు కూర్పుల నేర్పు. అట్టికృషి సంఘముతో సంబంధించినదే యైయున్నది. అట్టి విధానమునకు నేర్పువా...

న్యాయ నియుక్తులగు...

యైనను నేర్పువారిని గు...

వారిని శిష్యభావముతోను. వ...

ధర్మముల లో మూలసూత్రమునుగదా.

ఇట్లు నేర్చుటలు రెండురకములు చున్నవి. 1. పెద్దలైన అనుభవజ్ఞులు చేయుచున్న వారిని వెన్నాడి వారి చేతులజూచి, అనుభవము ముగా గడించి నేర్చుకొనుట. దీనిని ప్రయోగాత్మక విద్య (Practical knowledge) యందుము. ఇది ఆయాపనులు చేయువారి ననుసరించిన నలవడును. ఇట్టివి వృత్తి విద్యలనబడును. (2) అట్టి పని చేయునప్పుడు పనిననుసరించి, అంచనా, కొలత నియమములు, మొదలైన విషయములు నేర్పు విధానము గ్రంథపాఠముల నందుటచే అట్టి జ్ఞానము చదువు వలన నలవడును. (Theoritical knowledge).

అట్టి చదువుపాఠశాలలో లభ్యమగును. పెద్దలు బాలురుపోవు పాఠశాలకు బోలేరుకదా! పాఠశాలా నియమములు, పగటివేళలు, వారికి సరిపడవు గదా! ఇవి యెట్లు సాధ్యమగునని యిప్పటిసమస్య.

ఇట్టి వయోజనులకు బాలురకు వర్తింపజేయు పాఠశాలా నియమములు లేకుండగనే "వయోజన పాఠశాలలు" నెలకొల్పి, జ్ఞానవంతులు గొన్ని సూచనలు, ప్రణాళికలు, యేర్పరించినారు. ఇది ప్రస్తుతము ప్రజాప్రభుత్వములోని విద్యా ప్రణాళికలో నొక ప్రధానాంగమని మన ప్రభుత్వముప్రత్యేక శ్రద్ధతో ధనసహాయము చేయుచున్నది.

వయోజన విద్యానుగుణమగు పుస్తకములు, బోధనోపకరణములు (Charts and appliances) వెలువడుచున్నవి. శ్రీ నర్రావుల వెంకటసుబ్బారావు ప్రభృతులు చక్కని సోపానవిధానములు గల్పించి వయోజనవిద్యా సౌధారోహణమునకు అవకాశము గల్పించుచున్నారు. శ్రీ రామా అండ్ కో వారు, వెంకట్రామా అండ్ కో., వారు ప్రచురించి విస్తృత వయోజన విద్యకు పునాదులు గల్పించుచున్నారు.

నేర్పువారు ఉపాధ్యాయులును గావచ్చును. లేక ఇతర ఉద్యోగులును గావచ్చును. కాని యితరులు

...యము
...ంట విధా
...రికి లభించక
...! వారి జీవిత
...ంకితము చేయబడినవి!
...? వయోజనులకైన నేమి?
...ంత, వయోజనులతో పాటు
...ంచిన ఉపాధ్యాయుల జీవితముల
...న ఆర్థికసంపత్తి జతపరుపబడునుగదా!
...రకే బోధనాభ్యసన పద్ధతులలో చక్కని
...ు గవర్నమెంటువారి బోధనాభ్యసన పాఠ
...లలో బొందియుండి, వృత్తిసాగించి ఆర్థికముగా అసంతుష్టితో గడుపుచుండుట అందఱు ఎఱిగినదే. దానికి సహాయకారిగా వయోజన విద్యాబోధన శిక్షణపొంది, కేంద్రముల నేర్పరచి, ఇతోధికముగా దానికై యొసంగుబడు విద్యా వేతనముగూడ పొందిన కొంతసహాయమునుపొందిన వారగుదురు. నిజమే. కాని ఇది సాధ్యమగునా ? అను ప్రశ్న కలుగక మానదు. ప్రస్తుత వాతావరణమున దీనిని ఆకర్షణీయముగాజేసి, క్రమ పద్ధతిని నడుపుము, సంగీతము, నాటకములు, బొబ్బిలికథలు వార్తా పత్రికలు మున్నగువానివలన శిక్షణయిచ్చినచో వయోజనులు చేరుదురని యిప్పటి అనుభవనీయులు కొందఱనుచున్నారు. మఱికొందరు రాజకీయ లాలసులైన యిన్ని పార్టీల విజృంభణముతోనిది సాగునా యనుచున్నారు. ఇవి ఉపాధ్యాయునికే లాభముగదా ? వారికొరకే వీనిని తెరచినారనుచున్నారు. మఱి కొందఱు ఇట్టివ్యాఖ్యానములతో నేర్ప నుద్యమించి నుపాధ్యాయుడు డిల్లపోవుచున్నాడు. తిల్లడిల్లుచున్నాడు. అట్టి శంకాస్వాంతులగు నుపాధ్యాయుల నుత్సాహపరచుట ధర్మము. వయోజనులుగూడ అట్టి వాటికి తావొసంగక తామెట్టి వారైనను విద్యా సంప్రదాయ ప్రకారము తామొక చక్కనివారనుకొని, విద్య నేర్చుకొనుటయే తమ ధర్మమనుకొని, పల్లెపట్టింపులుతూరుపారబట్టి, చక్కనివిద్యకుదోహద మిచ్చి, నేర్చుకొనుటకై యుద్దేశించిననాడే ఇది సుకరముగా సాగునని యెఱుంగవలెను. ఇందువలన ప్రజాసేవలో నొక పవిత్రాంగమునకు పుష్టి కలిగించిన వారలగుదురు.

వయోజనవిద్య యిప్పుడే యేర్పాటు చేయబడినది కాదు. పూర్వమునుండియు ఇది అనుసరింపబడిన దనుటకెన్నెని నిదర్శనములు గలవు. ఒకటి రెండు ఉదాహరణల దీసికొందము.

కాళిదాసు బాల్యమును స్మృతికి దెచ్చుకొనుడు. అతడు మొదట జడుడు. మోటుమానిసి. పశువుల కాపరి. వానిజీవిత మాదశలోనే యున్న మనకావ్య పఠనమేమగును ? అతడు వయస్సువచ్చిన తరువాత విద్యాధిపుడై మహాకవి యైనాడుగదా !

భోజునిసుఖసందర్శన భాగ్యముననే ప్రజలు విద్యావంతులైనారని భోజకథలు తెలుపుచున్నవి.

అది వారి ప్రసన్నతా వైఖరినిబట్టి వయోజనవిద్య లభ్యమైనదనుడు, అది పురాణకాలమనుడు. ఏదియైనను పద్ధతి మార్పుగాని, మూలసూత్రము వయోజన విద్యాభ్యాసమేగదా ? మనకట్టి శక్తిలేదు. కాని అవసరములేదా ? అట్టి అవసరమునకు విధానమొకటి కావలెను. ఇప్పటికీవిధానమవలంబించుచును. విద్యనెరుగని వయోజనులలో యెంతెంతశక్తిభావము గర్భితమై యున్నదో ? వారికి విద్యావ్యాసంగపు మెరుగులు దిద్దిన తమవిజ్ఞాననిధులతో ఎందఱెందఱు తమ సేవలు భారతమాత కర్పింపనున్నారో ? వారికి గూడ విద్యాదేవత ప్రసన్నయగుగాక ! ఆ దేవికి వారుగూడ శ్రద్ధాంజలులు సమర్పింతురు గాక ! తోటి దేశములవారు తమతమ విద్యాసౌధములపై నుండి మన వయోజనవిద్యాసౌధశిఖరములు చూచి విస్మయపరులగుట మనజాతికంతకు శుభోదయము.



# 8 వ తరగతి పబ్లిక

అయ్యా !

ప్రభుత్వమువారు నిర్వహించుచున్న అన్నిపబ్లి
కనిష్ఠమగునది E. S. L. C. పబ్లిక్ పరీక్షయే. ఇది 1942 వ
నందున్నది. ప్రభుత్వమువారు కల్పించిన యీ సౌఖ్యమును పె
ముగా పల్లెవారు పొందుచున్నారు. అయినప్పటికి ఫలితములు ప్ర
మాత్రం ఎట్టిచర్య తీసికొనబడలేదు. ప్రభుత్వము నిర్వహించు అన్ని
ఫలితములను దినపత్రికలలో ప్రకటింపబడుచున్నవి గాని ఒక్క E. S. L.
ఫలితములు మాత్రం ప్రకటింపబడుచుండుటలేదు. ఈ పరీక్షకుహాజరగు వారి
పల్లెలనుండి వచ్చువారను సంగతి ప్రభుత్వానికి తెలియునిదికాదు. వీరు పరీక్ష
ఉత్తీర్ణులైనదీ, లేనిదీ వెంటనే తెలిసికొనుటకు వీలులేకున్నది. తపాలుద్వారా సర్టిఫికేట్లు
ఎప్పుడు వచ్చునది కూడ తెలియదు. ప్రభుత్వగెజెట్ వచ్చుట మరింత ఆలస్యమగును.
వచ్చిననూ జనసామాన్యమునకు అందుబాటులో లేనట్టిది. విద్యార్థులు పడుచున్న పై
యిక్కట్లులను గమనించి E. S. L. C. పబ్లిక్ పరీక్షా ఫలితములుగూడ దినపత్రికలలో
ప్రకటించునట్లు ఏర్పాట్లు చేయవలసినదిగా ప్రభుత్వమునకు మనవిచేయుచున్నాను.

వేణమ్మపేట,
తే 10-6-52 ది.

వందేమాతరమ్.

M. Venkata Rao Patnaik.

---

## పదపూరణము

రెండేసి అక్షరములను చేర్చి ప్రక్కన సూచింపబడిన యర్థములకు సరిపోవునట్లు ఈ క్రింది పదములను పూరింపుడు.

**విద్యార్థులు మాత్రమే పూరించి పంపవలెను.**

రెండు తప్పులకు మించకుండ చక్కగా పూరించి పంపిన వారిపేర్లు వచ్చేనెల సంచికలో ప్రకటింపబడును. అయితే అట్టి విద్యార్థులు మా పత్రికకు చందాదారులై యుండవలెను. లేదా రెండు అణాల తపాలా బిళ్ళలు విధిగాపంపవలెను. లేకున్న వారి పేర్లు ప్రకటింపబడవు.

| పదములు | | అర్థము | పదములు | | అర్థము |
|---|---|---|---|---|---|
| 1 మ — — ము | — | కిరీటము | 6 మ — — ము | — | మొసలి |
| 2 మ — — ము | — | చావు | 7 మ — — ము | — | నెమలి |
| 3 మ — — ము | — | అసూయ | 8 మ — — ము | — | హంస |
| 4 మ — — ము | — | మురికి | 9 మ — — ము | — | కోతి |
| 5 మ — — ము | — | తీపి | 10 మ — — ము | — | దున్నపోతు |

శ్రీ యం. తాతయ్య,
టీచరు - గర్భాం.

# ప్రశ్నలు

...నను; ...కే; ...టకొప్పు చెప్పుడు,

...బూరాడ గోపాలం,
టీచరు-గెద్దవానిపేట.

అక్షరములు నాల్గు-అగు నొక్క-పుష్పంబు;
ఒకటి-మూడు-నాల్గు-జడకొప్పు;
రెండు-మూడు చేరి-కొండకు చెల్లును:
అట్టి పుష్పమేదొ ! అరసి చెపుడు.

—శ్రీ పి. నారాయణనాయుడు,
విద్యార్థి-పెదమేడపల్లి.

---

## జూన్ నెల చిత్రప్రశ్నలు

1952 సం॥ జూన్ నెల సంచికలో ప్రకటింపబడిన

## వివేక ప్రశ్నలు

అను చిత్రప్రశ్నలకు జవాబులు

౧. తమాలము. ౨. తోట - మడి - చేలు - మూల - మీద.

* * *

రెండు ప్రశ్నలకు సరియైన సమాధానములు పంపినవారు

చందా నెం.

336. బి. సి. వి. సుబ్బరాజుగారు - హెడ్మాష్టరు - ఇంజేడు
46. శేగిడి సత్యనారాయణగారు - మేనేజరు - కోటిపాం
423. యం. శ్రీరాములుగారు - హెడ్మాష్టరు - దేవరాయపల్లి
205. ఎ. వి. గోవిందరాజులుగారు - హెడ్మాష్టరు - తోపుదుర్తి
232. దోశల తమ్మిశెట్టిగారు - టీచరు - కంతలవానిపేట
571. భానూరు సత్యనారాయణ పట్నాయక్ గారు - హెడ్మాష్టరు - అకలంగి
270. భోగాపురపు సీతారామస్వామిగారు - హెడ్మాష్టరు - కొట్టిశ
695. కలిదిండి సత్యనారాయణరాజుగారు - టీచరు - మొయిద
609. ఆర్. దివాకరరాజుగారు - టీచరుమేనేజరు - శేగాటిపల్లి

మొదటిప్రశ్నకు మాత్రమే

525. కె. రామన్నగారు - రిటైర్డుటీచరు - కోడుమూరు
230. యడవిల్లి కృష్ణమూర్తిగారు - బాడంగి
703. అరసాడ శ్రీరాములుగారు - మేనేజరు - పణుకువలస
111. దుంప రామమూర్తిగారు - టీచరు - చింతపల్లిపేట

---

## పదపూరణము

**సమాధానములు :** 1 సతతము 2 సహనము 3 సమీపము 4 సమయము 5 సమాజము 6 సమూహము 7 సదనము 8 సహాయము 9 సవనము 10 సమీరము

అన్నిపదములు తప్పులులేకుండ పూరించి పంపిన విద్యార్థులు

దుంప నారాయణమూర్తి - 5 వ తరగతి - అడపాపేట
తాడేల చిన్నయ్య - 5 వ తరగతి - బూర్జివలస
వెంపడాపు అప్పలనాయుడు - 5 వ తరగతి - బూర్జివలస



# పంతుళ్ళకొఱత

పాఠశాలలు తెఱచినారు. ప్రవేశపరీక్షలు జరిగాయి. ఆర్థికమాంద్యము తొంగి చూస్తున్నప్పటికి వందల కొలది విద్యార్థులు పరీక్షలకు కూర్చున్నారు. ఆయా పరీక్షలలో కృతార్థులైనారు. అంతే చదువుకోటానికి మాత్రం చాలామందికి అవకాశంలేదు. ప్రవేశపరీక్షలు జరిగినస్కూలులోనే సీట్లు లేవు. పొమ్మంటున్నారు. క్రొత్తగా ఇన్ని స్కూళ్ళు పెట్టినా సీట్లకు కరువేమిటి! పాఠశాలల్లో స్థలంచాలకనా? పంతుళ్ళు లేకనా? ఇదే పెద్దసమస్య.

ప్రవేశపరీక్షలు గవర్నమెంటు వారే జరుపుతారని లోగడ ప్రకటించారు. కాని యెందువల్లనో యీ సంవత్సరం మానుకున్నారు. వచ్చేసంవత్సరం తప్పకుండా జరుపుతారన్న భావంతోనో, అలాజరిపితే తమపిల్లలు ఉత్తీర్ణులు కాలేరేమో అన్న భయంతోనో, ఈసంవత్సరం ఎక్కడెక్కడి వారంతా తమపిల్లల్ని ప్రవేశ పరీక్షలకు కూర్చోబెట్టారు. బాగానేవుంది, ప్రతిపాఠశాలకు పిల్లలకొఱతలేకుండ సంఖ్యకూడా చాలాపెరిగింది. కాని యేమిలాభం? బోర్డు స్కూళ్ళలో ఎక్కువసెక్షనులు చేయవద్దని తాఖీదులు జారీచేయబడ్డవి. నిండుసెక్షనులు లేకపోతే మిగిలిన వారందఱికీ టి. సి. లు ఇచ్చిపంపమన్నారు. చాలాచోట్ల ఇలాగే జరిగింది. పోతే కమిటీస్కూళ్ళుకూడ ఈ పద్ధతినే అవలంబించాయి. కొన్ని పాఠశాల ఉన్న ఊరిపిల్లలకే సీట్లు లేదు. వారుపడేతిప్పలు చెప్పనికేమి. ఆపిల్లలంతా ఎక్కడికి వెళ్ళిచదవాలి.

ఈ సీట్లకొఱత కాలేజీలు మొదలుకొని ఎలిమెంటరీ పాఠశాలలవఱకు కనిపిస్తున్నది. విద్యాభివృద్ధి ఎక్కువగా జరగాలని ప్రచారంచేసే యీ రోజుల్లో యీసీట్ల కొఱతయేమిటి? ఉన్నవూళ్ళో పాఠశాలసీట్లులేవని చెప్పితే ఆపిల్లలు పొరుగూళ్ళకు వెళ్ళి వ్యయప్రయాసలకోర్చి చదువుకోగలరా! అసలు యీసీట్లకొఱతకు కారణమేమిటి?

స్థలాభావం ప్రధానకారణం కానేరదు. ఎందుకంటే తాత్కాలికంగా ఏవో కొన్ని పాకలువేసి సరిపెట్టుకోవచ్చు. అందుకు ప్రభుత్వమైనా కాదనదు. ఇకపోతే పంతుళ్ళకొఱతే దీనికి ప్రధానకారణంగా కనిపిస్తున్నది. కనిపించుటేమిటి? అసలు సంగతే అది. అయితే పంతుళ్ళకొఱత తీరేదెట్లు? లోగడ మేము పేర్కొన్నట్లు — ఇతరకారణాలెన్ని వున్నప్పటికీ — ముఖ్యంగా ట్రయినింగు సమస్య పెద్దభూతంగా అడ్డుపడుతున్నది. దీన్నిగురించి ప్రభుత్వం శ్రద్ధవహిస్తున్నట్లు కన్పించదు.

మనతెలుగు జిల్లాలలోవున్న ట్రయినింగు కేంద్రాలలో సీట్లు పరిమితం చేయబడ్డవి. బి. యిడి. సీట్లు మొత్తం మీద

...వారు
ఈ కొద్ది
...రిపోతారా ?
వేసుకుందామా
...ుమతించరు. ఒకవేళ
తాత్కాలికం. అట్టివారికి
...కూడా తక్కువే. ఈ తక్కువ
... పనిచేయటానికి చాలామంది ఇష్ట...రు. కాకపోతే ఎక్కడా గతిలేనివారు మాత్రం ఇందుకు పాల్పడుతారు. వారైనా ఏకొద్దిమందో లభిస్తారుగాని చాలినంత మంది దొరకరు. ఈవిధంగా పంతుళ్ళ కొఱతవల్ల చాలా హైస్కూళ్ళు బాధపడుతున్నవి. కొన్నికొన్ని స్కూళ్ళు పంతుళ్ళు లేకుండానే – ఉన్న యేకొద్దిమందితోనో – సంవత్సరం పొడుగునా పనిచేస్తున్నవి. ఈ కొఱతను కారణంగా తీసుకొని క్రొత్త స్కూళ్ళు పెట్టటానికి ప్రభుత్వం అనుమతి యివ్వనంటున్నది. ఇందువల్ల ఎక్కువ, పాఠశాలలు నెలకొల్పటానికిగాని, విద్యాభివృద్ధి ఎక్కువగా జరుగుటకుగాని, వీలులేకుండా పోతున్నది.

బి. యిడి. సీట్లసంగతి యిఱాప్రంటే సెకండరీగ్రేడు యింతకంటె అధ్వాన్నంగా వుంది. సెకండరీగ్రేడువారు హైస్కూళ్ళకే గాక, ఎలిమెంటరీ స్కూళ్ళకుగూడా చాలా అవసరం, ఎంతోమందికావాలి. ఈ సంగతి బహిరంగ రహస్యమైనప్పటికీ, యీగ్రేడులో గూడా ట్రయినింగు సీట్లు పరిమితం చేయబడవి. ఇదేమిటి? హాయ్యరు గ్రేడు ట్రయినింగుకు కూడ సీట్లు దొరకక చాలమంది బాధ పడుతున్నారు. పలుకుబడిగలవారికి, ...ంచాలు పెట్టే వారికే మాత్రం, సీట్లు లభిస్తున్నవి. ఇది రానురాను ఒకవ్యాపారంక్రింద మారుతున్నదని చెప్ప సాహసించినందుకు మన్నించాలి. ట్రయినింగుసమస్య యింత బాధాకరమైపోతే పంతుళ్ళకొఱత యేలా తీరుతుంది? విద్యాభివృద్ధి యెలా జరుగుతుంది ?

ఈ ట్రయినింగు సమస్యలో యింకొక పెద్ద విఘాతం అడ్డు తగులుతున్నది. ఇది ముఖ్యంగా కుంటి, గ్రుడ్డి, మొదలగువారికి చెందినది. ఉదాహరణకు ఒకకుంటివాడో, గ్రుడ్డివాడో, చేయిలేనివాడో, ఏదో ఒక విధమైన అంగవైకల్యం గలవాడు యస్. యస్. యల్. సి. పరీక్షలో మంచిమార్కులతో ప్యాసైనప్పటికి, చక్కని ఆరోగ్యవంతుడైనప్పటికి, మంచి తెలివితేటలున్నప్పటికీ, భగవంతుడు కల్పించిన ఆ యంగవైకల్యంవల్ల అతనికి ట్రయినింగుసీటు నిరాకరింపబడుతున్నది. అదేమంటే "సరిగు ఫిజికల్ ఫిట్ నెస్" లేదని కారణం చెప్పబడుతున్నది. ఇది యెంత అన్యాయమో విచారించండి. దేవుడు కల్పించినదానికి అతడు బాధ్యుడా ! స్కూలుఫైనల్ వఱకు చదువుటకు పనికివచ్చాడు కాని ట్రయినింగు పొందుటకు మాత్రం అనర్హుడైనాడు కాబోలు ! అంగవైకల్యం గలవాడు చదువుటకే పనికిరాదని మొదట్లోనే శాసిస్తే యీబాధ వుండదుగదా ! తీరా పరీక్ష వఱకు చదివి, ప్యాసై, యేదో జీవనోపాధికని ట్రయినింగుకు దరఖాస్తు పెట్టుకొంటే యీనిరాకరణ యేమిటి ? ఇక వాని గతి యేమిటి ? ఒకచోట కూర్చుండి విద్య చెప్పటకే వాడు పనికిరాకపోతే మఱి ఏ వుద్యోగానికి పనికివస్తాడు ? ఈయంగవైకల్యం కారణంమీద ట్రయినింగుకు

# బాధితోపాధ్యాయుడు శ్రీ
# ఆర్థికసహాయ

కృష్ణాజిల్లా ప్రాథమికోపాధ్యాయసంఘ కార్యదర్శి ఇ
యిలా విజ్ఞప్తి చేస్తున్నారు.

శ్రీ జొజ్ఝవరపు యేసురత్నముగారు విజయవాడ తాలూకా ప్ర
కర్తలలో నొకరు. గత ప్రభుత్వ నిర్బంధవిధానములో నిర్దోషియైన యీ
క్యాంపుకు తీసుకుపోబడి దారుణమైన హింసాకాండకు గురిచేయబడ్డాడు. ఆరోగ్య
పోలీసుక్యాంపునుండి వచ్చినప్పటినుండి యిప్పటివరకు కోలుకోనేలేదు. ప్రస్తుతము ఆ
...లో యున్నారు. "క్షయవ్యాధి" లక్షణము లేర్పడినట్లును, పెద్ద హాస్పటలుకు పంప
యును డాక్టర్లు చెప్పారు, క్షీణించిన ఆర్థికపరిస్థితులు అందుకు అనుమతించుటలేదు.

అన్యాయముగా పోలీసు హింసాకాండకు గురియై ఆరోగ్యమును పూర్తిగా కోల్పోయి ప్ర
పాయస్థితిలో నున్న యీ బాధిత కార్యకర్తను ఆర్థికముగా ఆదుకొని రక్షించుకోవలసిన బాధ్యత యీనా
మనందరిపైనను యున్నది. ఉపాధ్యాయులు, ప్రజలు (ఈ దిగువ చిరునామాకు) యీ బాధితోపాధ్యాయ
సోదరునికి శక్తికొలది వెంటనే ఆర్థికసహాయముచేసి ఈయనను రక్షించుటకు పూనుకొనవలసినదిగా విజ్ఞప్తి
చేయుచున్నాను.

శ్రీ యేసురత్నముగారి చిరునామా:

శ్రీ జొజ్ఝవరపు యేసురత్నము,
C/o రెవరెండు డి. ఆర్. ఐజక్, బి. ఏ., బి. యిడి.
గుడ్లవల్లేరు (P. O.) కృష్ణాజిల్లా.

---

౧౧౪ వ పేజీ తరువాయి

అనర్హుడనుట చాలా అన్యాయం ప్రభుత్వం దీన్ని గురించి శ్రద్ధగా ఆలోచించి, నిబంధనలను సవరించి, అట్టివారికి న్యాయం చేయగలదని విశ్వసిస్తున్నాము. ఇట్టి మార్పు సాధ్యమైనంత త్వరలోనే జరుగవలెనని మా ప్రార్థన.

పై విషయాలను బట్టి చూస్తే పంతుళ్ల కొఱతకు ప్రధానకారణం ట్రయినింగుసమస్యయే అని తేలిపోతున్నది. కాబట్టి యీ సమస్యను త్వరగా పరిష్కరించి, అడిగిన వారికందఱికీ అన్నిగ్రేడులలోను, లేవనకుండ ట్రయినింగుసీట్లు ఇచ్చి - ఉన్న కేంద్రాలు చాలకపోతే మఱికొన్ని క్రొత్తకేంద్రాలు స్థాపించి - ఖర్చు అనుకుండ రాష్ట్రంలో వున్న పెద్ద పెద్ద హైస్కూళ్లకు అనుబంధ సంస్థలుగా నిబంధించి - ఇదొక చీకటి వ్యాపారక్రింద మారకుండ, పవిత్రమైన విద్యాశాఖలో అవినీతి పొడసూపకుండ - ఇటు పంతుళ్ళ కొఱత తీరునట్లు - అటు విద్యాభివృద్ధి యెక్కువగా జరుగునట్లు - ఊరూర క్రొత్త పాఠశాలలు నెలకొల్పబడునట్లు ప్రభుత్వము ప్రయత్నించగలదని, ఈ విషయంలో ఆలస్యం జరుగకుండ సత్వర ఫలితాన్ని సమకూర్చగలదనీ, గట్టిగా నమ్ముచున్నాము.

—సంపాదకుడు



# సెంట్రల్ పేకమిషన్ వేతనాలివ్వాలి

## పులివెందుల తాలూకా ఉపాధ్యాయ మహాసభ అభ్యర్థన

ది 31-5-52 తేదీన పులివెందుల తాలూకా ఉపాధ్యాయ మహాసభ - శ్రీ కోటావలి దామోదర్ (MALLB చరిత్ర అధ్యాపకులు, తెనాలి కాలేజి) గారి అధ్యక్షత క్రింద పులివెందులలో జరిగింది. 5 సెంటర్లనుండి 100 మంది ప్రతినిధులు హాజరైనారు.

ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీ సి. వెంగళరెడ్డిగారు సభికుల నాహ్వానిస్తూ, ఉపన్యసించారు. కార్యదర్శి శ్రీ జి. వెంకటప్పగారు గతమూడు సంవత్సరాల తాలూకు వృత్తాంతాన్ని సమీక్షిస్తూ, నివేదిక సమర్పించారు. ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ సహాయ కార్యదర్శి శ్రీ వి. విజయరామ రాజాగారు సభను ప్రారంభించారు. జాతీయ విద్యావిధానానికి, దాని అమలుపరచేటి ఉపాధ్యాయుల సాంఘిక ఆర్థిక రాజకీయ హక్కులకు పోరాడుతున్న ఉపాధ్యాయ సంఘ కార్యకర్తల సర్టిఫికెట్లను సస్పెండుచేయడం ఉద్యోగాల నుండి తొలగించడం-ప్రజాస్వామిక విరుద్ధమని; ఉపాధ్యాయుల సంఘస్వాతంత్ర్యానికై హైకోర్టునకువెళ్ళి విజయంపొందుటలు, గతనాలుగు సంవత్సరాలలో సంఘము సాధించిన విజయాలు, వివరిస్తూ నూటికి నూరుమంది సభ్యులుగాచేరి బలమైనశక్తిగా తయారై సత్వరవిద్యాభివృద్ధికై కృషి చేయాలని వుపన్యసించారు.

---

౧౧౬ వ పేజీ తరువాయి

గాక, మరి ఏ యితరపనులు చేసినను కాలము సద్వినియోగపరుచుటయే కాక చక్కని రాబడి వచ్చుటకును అవకాశమున్నది.

ఇట్టి కొన్ని విధానములలో మాత్రం లోపము కన్పట్టుచున్నది. మిగిలిన విషయములు ఉత్కృష్టముగా నున్నప్పటికి సామాన్యప్రజలు యీ విధానము క్రొత్త యగుటచేతను, దుష్ప్రచారముల మూలమునను దీనికి ప్రజాహ్వానం లేకున్నది. నాన్-బేసిక్ ట్రయినింగుకు - బేసిక్ ట్రయినింగుకు - వచ్చు వ్యత్యాసము తారతమ్యమే యిందలి సత్యమును చెప్పక చెప్పుచున్నది. ఇందుగూర్చి ప్రభుత్వమువారు కోట్లకొలది రూపాయలు ఖర్చుపెట్టుటకంటె. హైస్కూలునందలి కొన్ని ఉత్కృష్ట విధానములను ప్రతిపాఠశాలలోను తప్పక అమలు పర్చవలెనని విద్యాధికారులను ఆదేశించుట మిక్కిలి శ్రేయమని నామనవి.

వేణమ్మపేట,
తేది 10—6—52.

జైహింద్ !
M. వేంకట్రావు పట్నాయక్

...పన్యాసంలో యిట్లు పన్యసించిరి. అంతర్జాతీయంగా
...మన సమస్యల గురించి యోచించుటకు అవకాశం లేకుండా
...రశాలకక్కితే అన్నికొలతే, యీ విధంగా మన విద్యాసేవ
...ముల్లుకుంటే యేమీ విశిష్టత లేకపోవుటవలననే విద్యార్థుల నాక
...విద్యార్థుల కేమితెలుసునో పరిశోధించేవిగా లేవు. నూతనంగా వచ్చిన
...ర్థుల మేధాశక్తిని యేవిధంగాను పెంపొందించేదిగాలేదు. మొదటి
...మాల తిరుగుబాటును పితూరీక్రింద, మౌర్యవంశము మురయానేదాసినుండి,
...ు, అసత్యాలతోను, నిండివుంది. విద్యా విలువలు విపరీతంగా పెరిగాయి మన
...లఫీజు 30% వరకు పెరిగింది. పాఠ్యపుస్తకాల ధరలు విపరీతంగా పెరిగి కంపెనీలకు
...యిస్తున్నవి. బీదలకు, మధ్యతరగతివారికి, వున్నతవిద్యలు యేమాత్రం అందుబాటులో
...గ్యాళ్ళతో గాజుగొట్టాలకుబదులు యినుప గొట్టాలు వాడాలని, క్లోరు తెరగడం చూచి చెడి
...ని, వుపాధ్యాయులను గోలపెట్టే మేనేజర్ల చేతులలో పాఠశాలలున్నాయని, యీలాంటి అవక
... విద్యావిధానం మార్చుటకు కుట్రచక్రాలతో బిగించియున్న నిరంకుశ విద్యానిబంధనలను
మార్పించుటకు, జీవించడానికి తగిన జీతాల సంపాదించుటకు, ఎట్టి విభేదాలు లేకుండా సంఘటిత పడా
లని చెప్పి ముగించిరి.

చర్చల అనంతరము ఈ క్రింది తీర్మానాలు ఆమోదించబడినవి. (1) ప్రభుత్వ నిర్బంధ విధానంలో బాధపడిన వుపాధ్యాయ కుటుంబాలకు సానుభూతి తెల్పడమైనది (2) ఎట్టి సంజాయిషీ, విచారణ లేకుండా సస్పెండు చేసిన వుపాధ్యాయుల సర్టిఫికెట్టులు తిరిగి వెంటనే పునరుద్ధరించాలనీ (3) సత్వరాంధ్రరాష్ట్రాన్ని నిర్మించాలనీ (4) సెంట్రల్ పేకమీషన్ వేతనాలను ఈ బడ్జెట్టులోనైన ఆమోదించాలనీ (5) క్షామప్రాంతాలలో హాజరు నిబంధన ఎత్తివేసి, ఉపాధ్యాయులకు కరువు అప్పుల నివ్వాలనీ, పిల్లలకు వుచితంగా భోజనం-బట్టలు-యివ్వాలనీ, (6) జనరల్ ఎన్నికలలో వుపాధ్యాయులకు యివ్వవలసిన T. Aలు తొందరగా యివ్వాలనీ (7) సింహాద్రిపురం హిందీ టీచరుగారిని తిరిగి వుద్యోగంలో నియమించాలని, మొదలగు తీర్మానములు చేయబడినవి.

నూతన సంవత్సరానికి శ్రీ సి. వెంగళరెడ్డిగారు అధ్యక్షులుగాను, శ్రీ కె. కొండారెడ్డిగారు ఉపాధ్యక్షులుగాను, శ్రీ జి. వెంకటప్పగారు ప్రధానకార్యదర్శిగాను, శ్రీ సి. వెంకటరెడ్డిగారు సహాయ కార్యదర్శిగాను, 7 మంది కార్యవర్గ సభ్యులతో తాలూకా కమిటీ ఎన్నుకోబడినది.

సమావేశానంతరం ఉపాధ్యాయులు బారులుతీరి బ్యాండువాయిద్యాలతో ఉపాధ్యాయుల కోర్కెల నినాదాలతో వూరేగింపు జరుపబడెను. రాత్రి 8 గంటలకు శ్రీ కోడాలి దామోదరయ్యగారి అధ్యక్షత క్రింద బహిరంగసభ జరుపబడింది. 3000 మంది ప్రజలు హాజరయ్యారు. శ్రీ వి. విజయరామరాజుగారు, అధ్యక్షులవారు "ఉపాధ్యాయుల కోర్కెలు, విద్యావిధానం, ప్రజల సహకారం" అనే విషయాలపై వుపన్యసించారు.

ఉపన్యాసానంతరం కడపజిల్లా ప్రజానాట్యమండలి దళంవారిచే బాబూ నాయకత్వాన "బడిపంతులు" అను బుర్రకథ రసవత్తరంగా చెప్పబడింది. ఉపాధ్యాయుల కష్టాలు, ప్రజలకు, ఉపాధ్యాయులకు గల సంబంధాలు, రాయలసీమ విషాదకరువు చక్కగా వివరించారు.

జి. వెంకటప్ప, కార్యదర్శి,
పులివెందుల తాలూకా ఉపాధ్యాయసంఘం.

# పాఠశాలలు

ఆంగ్లేయులు దేశమును విడిచిపెట్టుటయు జరిగినది. ౹
త్యజించుటయును జరిగినది. ప్రజాప్రభుత్వమును, నూతనముగ
లలో మాత్రము మార్పు జరుగకపోవుట విచారకరము. నేడు పం
లయము వరకుగల ప్రతి ఆఫీసుకును, ప్రాథమిక పాఠశాలనుండి విశ్వవిద
లయమునకును, ప్రతిసంస్థకు, వ్యక్తికికూడ, ఆదివారము నిర్బంధముగా సెల
సాంప్రదాయము. ఆంగ్లేయులు క్రైస్తవమతస్థులగుటవలన చర్చిలో ప్రార్థనలు
వారి సౌకర్యార్థము ఆదివారము సెలవు దినముగా నిర్బంధముగా అమలు జరిపిరి. ఇది .
మునకు విరుద్ధము. హిందువులు శని, సోమవారములను పవిత్ర దినములుగా పరిగణించుచు
లలోనే వారు ముఖ్యముగా ఉపవాసములు, జపతపములు, మొదలైన పుణ్యకార్యములు చే
ప్రజాప్రభుత్వము వారిది గుర్తించి హిందువుల సౌకర్యార్థము సోమవారము (బాలపాఠశాలలకు శ
సెలవు దినముగా పరిగణింపబడుచున్నది.) పూర్తి సెలవు దినముగాను. ఆదివారమును పనిచేయు ది
(Working day) గాను, ప్రకటించవలయునని సూచించుచున్నాను.

వేణమ్మపేట, } జైహింద్. ఇట్లు,
ది 11—5—52 } యమ్. వేంకట్రావు.

## ఏలూరు :

ది 10-5-52 వ తారీఖు శనివారం సాయంత్రం గం. 4-0 లకు శ్రీలోకనాథహయ్యరు ఎలిమెంటరీ బాలుర పాఠశాలయందు ఏలూరు ఈస్టురేంజి, ఎయిడెడ్ ఉపాధ్యాయ వార్షికోత్సవము శ్రీపశ్చిమగోదావరి జిల్లా విద్యాశాఖాధికారి శ్రీఅయ్యగారి వీర్రాజుపంతులు, B. A. BEd. గారి అధ్యక్షతను జరిగెను. సంఘ నివేదికానంతరము శ్రీ క. రామశాస్త్రి B A. BEd; (P. A. to D. E. O; W G Dt) శ్రీమాన్ M. V. N. శేషాచార్య B Sc BEd. (సీనియరు డిప్యూటీ యిన్స్పెక్టరు ఆఫ్ స్కూల్సు, ఈస్టురేంజి) శ్రీమాన్ S. జగన్నాథాచార్యులు, (ప్రధానోపాధ్యాయులు - చోడిదిబ్బస్కూలు) గార్లు ఉపన్యసించిరి.
పిమ్మట శ్రీలోకనాథహయ్యరు ఎలిమెంటరీ బాలురచే "కవిచమత్కృతి" నాటిక శ్రీ సరస్వతీ హయ్యరు ఎలిమెంటరీ బాలికలచే "బాపూజీ - పరీక్షబాలుడు" అనునృత్యములు; "జబ్బుకుదిరెను" అను నాటిక; ప్రదర్శింపబడెను. శ్రీ Ch. సీతారామయ్యగారు (లోకనాథస్కూలు) పాటకచ్చేరి జరిపిరి. అనంతరము జాతీయగీతముతోను, అభివందనములతోను. సభ ముగిసెను.

జి. సూర్యనారాయణమూర్తి, శెక్రటరీ,
ఏలూరు ఈస్ట్‌రేంజి ఎయిడెడ్ ఉపాధ్యాయ సంఘము.

## తూర్పుగోదావరి జిల్లా ప్రాథమికోపాధ్యాయుల కన్వెన్షను
### కాకినాడలో జూలై 19, 20 తేదీలలో

సోదరీ! సోదరులారా!!

ప్రాథమికోపాధ్యాయుల మందరము ఆంధ్రరాష్ట్ర ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషను స్థాపించుకొని, మనహక్కులకొరకు ఆందోళన చేస్తున్న విషయము, కొన్ని అమోఘమైన విజయాలను సాధించడము మీరందరూ ఎరిగినదే. ప్రభుత్వోద్యోగులవల్ల అక్రమంగావచ్చిన వత్తిడిని తప్పించుకొనుటకు హైకోర్టుకు కూడా వెళ్ళి, మన ఫెడరేషను న్యాయబద్ధమైనదని, అధికారుల ఉత్తరవులు అక్రమమని, తీర్పు పొందగలిగాము. ప్రభుత్వపరిపాలనా యంత్రములోనే మన ప్రతినిధులుండాలని ఫెడరేషను కార్యదర్శిగారైన

న్నలకు గలిపించుకున్నాము. మనబిడ్డలకు కొంత
దను ఉత్తరువులుకూడ జారీచేయించుకున్నాము. ఇట్లే
పడవలసిఉన్నది. పే కమీషను స్కేళ్ళనైనా సంపాదించాలి.
లో సేవ చేయించుకోవలసి ఉంది కనుక సంఘము నిర్మాణముగా
ఈ రణములో మన జిల్లాసంఘము — మహా[illegible]గా ఉన్నందున,
ఘాలతో బాటు బలమైన ఉద్యమము నిర్మించి, మన ఇబ్బందులనుండి
ము జూలై 19,20 తేదీలలో "కాకినాడ బాల భారతీ పాఠశాలలో" తూర్పు
కోపాధ్యాయుల కన్వెన్షను జరుపబడుచున్నది కనుక సోదరీ సోదరులు అమితో
తి సెంటరునుండి కనీసము ఇద్దరైనా ప్రతినిధులుగా వచ్చి కార్యక్రమును జయ
ప్రార్థన నాటి సమావేశానికి ప్రత్యేకాహ్వానముపై రాష్ట్ర పెడరేషను అధ్యక్ష కార్యదర్శ
చ్చుచున్నారు.

విశ్వబ్రహ్మగోవను,
(Via) సామర్లకోట.

మారెళ్ళపూడి పుత్రసత్యశర్మ, ప్రెసిడెంటు,
సి. వి. రామజోగారావు, జి. రూబిన్,
కార్యదర్శులు.

# జిల్లాబోర్డు ఉపాధ్యాయుల ఇక్కట్లు తీర్చాలి!
# పే కమిషన్ స్కేల్సు అమలు జరపాలి!!

తూర్పుగోదావరిజిల్లా ప్రాథమికోపాధ్యాయ సంఘ కార్యదర్శి యం. నరసింహస్వామిగారు ఇలా వ్రాస్తున్నారు.

తూ॥ గో॥ జిల్లా ప్రాథమికోపాధ్యాయ కన్వెన్షన్ జూలై 19, 20 తేదీలలో కాకినాడ పి. ఆర్. సైన్సు కాలేజీహాల్లో శ్రీపిరింగరాజు రామకృష్ణయ్య యమ్. యల్. పి గారి అధ్యక్షతను జరిగింది.

ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషను అధ్యక్షులు శ్రీచెన్నుపాటి లక్ష్మయ్యగారు సభను ప్రారంభించుతూ, గత 5 సంవత్సరాలనుండి విద్యావిధానములో జరగవలసిన మార్పులను గురించి, ఉపాధ్యాయుల పరిస్థితులను చక్కబెట్టుటను గురించి, న్యాయబద్ధంగా ప్రభుత్వము ఎదుట పెట్టుటయేగాక, విద్యాశాఖ, జిల్లాబోర్డుల స్వార్థపరులైన కొందరి ఉపాధ్యాయుల ఆవక తవకలను బయటపెట్టి సరిచేయ పూనుకొన్నందులకు అందరూ కలసి ఉపాధ్యాయఫెడరేషనుమీద దాడిచేయ ప్రారంభించారనియు, వారిచేతులలోనున్న అధికారాలను పురస్కరించుకొని కార్యకర్తలను పనులనుండి తొలగించుట సర్టిఫికేటులను రద్దుచేయుట మొదలైన ఇబ్బందులకు గురిచేసారనియు ఉపాధ్యాయులందరకు ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషను సభ్యత్వము పనికిరాదనియు ఉపాధ్యాయ పత్రికను తెప్పించుకోరాదనియు నిరంకుశ ఉత్తర్వులు జారీచేసినారనియు అంగ గాద మద్రాసుహైకోర్టులో దావావేసి పైవారిఅందరిచర్యలు అక్రమమనియు ఆఉత్తర్వులేవీ చెల్లవనియు ఉపాధ్యాయులకు నూతన రాజ్యాంగచట్ట ప్రకారము వాక్సభా పత్రికా స్వాతంత్ర్యాలు కలవనియు ఆంధ్రరాష్ట్ర ఎలిమెంటరీ టీచర్సు ఫెడరేషను న్యాయబద్ధమైన సంస్థగనుక దానిలోచేరి పనిచేసేవారిపై ఇలాంటి ఉత్తర్వులు జారీచేయుహక్కు ఎవరికిలేదనియు నుడివిరి. గనుక ఉపాధ్యాయ సంఘాలను కట్టుదిట్టంగా నిర్మించుకొని ముందుకుపోవలసిన అవసరము ఎంతేనికలదనికూడా చెప్పిరి.

అధ్యక్షులు మాట్లాడుతూ క్రొత్తగావచ్చిన మంత్రివర్గము ఉపాధ్యాయుల విషయంలో శ్రద్ధ చూపుతుందని ఆశించుకొని ఈ బడ్జెటులో ఆయూశలు నిరాశలైనాయని, మనమందరము సుసంఘటితపడి ఏకోన్ముఖంగా తగిన కృషిచేసిననాడే మనవిషయం ఆలోచించబడుతుందని ఈనాడు మనతోపాటు మన దేశంలోని ఉపాధ్యాయ సంఘాలేకాక ప్రపంచంలోని ఉపాధ్యాయ సంఘాలుకూడ మన పరిస్థితులను

చక్క దిద్దుకొనుటకు ఐక్యంగా కృషిచేయ ప్రారంభి
కృషిచేసి తోడ్పడుతామనియు గనుక మీరు మా న్యా
సంఘసభ్యులుగాను. పత్రికా చందాదారులుగాను. అందరు

ఆంధ్రరాష్ట్ర టీచర్సు ఫెడరేషను కార్యదర్శి శ్రీ నో
మికోపాధ్యాయులు పట్టుదలగా పనిచేయుచున్నందులకు, వారి
కృష్ణయ్యగారిని కౌన్సిలుకు సభ్యులుగా నెగ్గించుకోగల్గినందులకు, అభి
ప్రాథమిక ఉపాధ్యాయులందరం ఏకకుటుంబీకులమనియు, బ్రిటిష్ ప్రభుత్వ
యున్నారనియు, మన ప్రభుత్వముకూడా ఆ విధానాన్నే అనుసరించుచున్న
మనియు, ఆ చీలికలు పోగొట్టుకొని అందరుకలిసి పనిచేసినప్పుడే మన పరిస్థితులు
చెప్పారు. ఇంతేగాక, వెంటనే విద్యావిధానములోను. పాఠ్యగ్రంథాలలోను, మా
అందుకు ఉపాధ్యాయులనే నియమించి, ప్రభుత్వము పనిచేయించాలనియు, చెప్పిరి.

అనంతరం

తూర్పుగోదావరిజిల్లాబోర్డు అధ్యక్షులవారు ఉపాధ్యాయులను తీసివేయుట, అక్రమట్రాన్సుఫర్ చేయుట, సెలవులు మంజూరుచేయకపోవుట మొదలైన చర్యలద్వారా ఉపాధ్యాయులనందరను ఇక్కట్ల పాలుచేయుచున్నందులకు అసమ్మతి తెల్పుతూ వాటినన్నిటిని సరిదిద్దుకోవలసినదిగా జిల్లాబోర్డు ప్రెసిడెంటువారిని కోరుచు తీర్మానించిరి. క్వాలిఫికేషన్ స్కేల్సు అమలుజరుపాలని నిర్బంధాలకు గురిచేసిన ఉపాధ్యాయుల ఉద్యోగాలు సర్టిఫికేట్ల జీతములు ఇప్పించవలసినదనియు రాయలసీమ ఉపాధ్యాయులకు తగినవసతులు కలిగించాలనియు తీర్మానించిరి.

నూతన సంవత్సరానికి జి. శ్రీరాములుగారిని ప్రెసిడెంటుగాను, వి. రామకృష్ణారావుగారిని ఉపాధ్యక్షులుగను, యం. నరసింహస్వామిగారిని కార్యదర్శిగను, యస్. గోపాలకృష్ణమూర్తిని సహాయకార్యదర్శిగను, వై. మాణిక్యాంబగారిని కోశాధికారిణిగను, తాలూకాకొకరు చొప్పున వర్కింగుకమిటీసభ్యులుగను, ఎన్నుకొనడమైనది.

కాకినాడ
21—7—52

యం. నరసింహస్వామి
కార్యదర్శి

## విజయనగరం:

విజయనగరం ఎయిడెడ్ ఎలిమెంటరీస్కూల్సు ఉపాధ్యాయుల యూనియను ది 14-6-52 న శ్రీ గండికోట బాబూరావుగారి అధ్యక్షతను కస్పా మునిసిపల్ హయ్యరు ఎలిమెంటరీ స్కూలులో సాయంత్రము 5 గంటలకు సమావేశమైనది. అందు శ్రీ S సుబ్రహ్మణ్యంగారిని అధ్యక్షులుగను, శ్రీ T. సన్యాసిరాజుగారిని ఉపాధ్యక్షులుగను, శ్రీ D. V కృష్ణారావుగారిని కార్యదర్శిగను, శ్రీ D. ఇబ్రాహేలు గారిని కోశాధికారిగను ఎన్నుకొనడమైనది. తిరిగి యూనియను ది 28-6-52 న రాజాబజారు ఎయిడెడు ఎలిమెంటరీపాఠశాలలో శ్రీ G. బాబూరావుగారి అధ్యక్షతక్రింద సాయంత్రము 4 గంటలకు జరుపబడెను. సభాధ్యక్షులు నిబంధనలను చదివి విపులీకరించిరి. యూనియను అధ్యక్షులగు శ్రీ S. సుబ్రహ్మణ్యంగారు యూనియను ఆశయములను తెల్పి దాని అభివృద్ధికి దోహదం చేయవలెనని ఉపాధ్యాయవర్గమును ప్రోత్సహించిరి. ఈ సంఘము శ్రీ విద్యాశాఖా డైరక్టరువారివలన రికగ్నైజు చేయబడినది. కాన ఎయిడెడు పాఠశాలలలో పనిచేయుచున్న ఉపాధ్యాయులు నిరభ్యంతరముగ చేరవచ్చునని తెలియజేసిరి. తదుపరి నిబంధన ననుసరించి ఈ దిగువ మెంబర్లను కార్యవర్గ సభ్యులుగ నియమించిరి. 1. శ్రీ Ch. సత్యనారాయణగారు, 2. శ్రీ P. రాములుగారు, 3 శ్రీ D. రామారావుగారు, 4. శ్రీ K. ఎర్రయ్యగారు, 5. శ్రీ G.V.L. నరసింహంగారు, 6. శ్రీ G. నారాయణమూర్తిగారు. తరువాత కార్యదర్శిగారి అభివందనములతో సమావేశము ముగిసెను.

డి. వి. కృష్ణారావు, సెక్రటరీ,
ఎయిడెడు ఎలిమెంటరీస్కూలు ఉపాధ్యాయుల యూనియను.




## 1952 ఆగష్టు 15 నుండి 1952 సెప్టెంబరు 14 వరకు.

—చలనం - ద్రవ్యలాభవ్యయములు - చోరభయం - చాంచల్యమానసత్వము.
వృషభం—ద్రవ్యనష్టము, అపమృత్యుభయం, ఆందోళనము, బంధువైరము, అపఖ్యాతి, మాననష్టం.
మిథునం—శుభకార్యసూచనలు, దైవతోపాసన, సద్గ్రంథపఠనం, గ్రంథరచన, గౌరవధనప్రాప్తి, కీర్తి, శుభవస్త్రాదిప్రాప్తి,
కర్కాటకం—జయం, రాజగౌరవం. స్వకాయకష్టం, పరనకార్యాలంపటత్వము, కీర్తి.
సింహం—శరీరకష్టం - దూరయాత్ర - బంధుదుఃఖవార్త - ధనవ్యయము.
కన్య—అపమృత్యుభయం - లాభవ్యయములు - జ్ఞాతివిరోధము - దూరగ్రామస్థితి
తుల—శరీరరుగ్మత - దూరప్రయాణములు - విద్యాప్రాప్తి - ధనలాభవ్యయములు.
వృశ్చికం—దూరప్రయాణం - భోజనసౌఖ్యం - విద్యాభ్యాసం - జనమైత్రి - ధనలాభం.
ధనుస్సు—విద్యాలాభం - దైవధ్యానము - లాభప్రాప్తి, బంధుమైత్రి - సంతానప్రాప్తి.
మకరం—ఆందోళన - బంధువియోగము - ద్రవ్యనష్టము - చంచలమానసము.
కుంభం—శుభప్రాప్తి - ఉద్యోగలాభం - యత్నకార్యసిద్ధి - శుభకార్యములు.
మీనం—బంధువృద్ధి - కుటుంబసౌఖ్యం - మిత్రవృద్ధి - స్త్రీమైత్రి - సత్యవచనములు.

(ఈ సంవత్సరంలో కార్తీకపౌర్ణమి - అశ్వినీనక్షత్రముతో కలియుటవల్ల అక్కడక్కడ దేశములో ధూమకేతుసందర్శనము - గొప్పవారి (ప్రభుజన) పీడలు - మరణపరిస్థితులు - నదీప్రవాహములు - నదులు పొంగుట - వ్యవసాయ నష్టములు - జననాశం - మొత్తముమీద నవంబరు మొదలు 1953 మార్చి వరకు ప్రభువులకు, ప్రజలకు విరోధాలేగాక యుద్ధప్రయత్నములుకూడ జరిగి ఎక్కువ అశాంతి యేర్పడు సూచనలు గనబడుచున్నవి)



Edited by Sri M. Venkata Ratnam Garu, B. A., & Printed and Published by Sri E. Venkaiah Garu at his Pattabhirama Press, Eluru



ప్రస్తుత ప్రాథమిక విద్యాప్రణాళిక ననుసరించు

పుస్తకములు, ఇతర పుస్తకముల జాబీ

ఇంగ్లీషు పాఠ్యగ్రంథములు

## LADDER OF ENGLISH

BY

The Rev. S. Paul B. A., B. T.,

and

Edited by Miss Olga Williamson M. A.

**1951**

| | |
|---|---|
| Book I for VI Std. (1950) | Rs. 1 0 0 |
| Book II for VII Std (1950) | 1 2 0 |

## జాతీయవాచకములు

ఉభయ భాషాప్రవీణ

వారణాసి రామబ్రహ్మం, యం. ఏ. గారిచే

డాక్టరు వేపా వరాహనరసింహం,

యం. ఏ పి. హెచ్. డి, గారి

సూచనల ననుసరించి

| | | | |
|---|---|---|---|
| 1 వ తరగతి | 0 4 0 | 5 వ తరగతి | 0 9 0 |
| 2 వ తరగతి | 0 5 0 | 6 వ తరగతి | 0 11 0 |
| 3 వ తరగతి | 0 6 0 | 7 వ తరగతి | 0 12 0 |
| 4 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 12 0 |

## జయరామావాచకములు

కవిరాజహంస, కవికులాలంకార

నోరి శేటి పార్వతీశము గారు

ఉపాధ్యాయుల సత్యనారాయణగారు M.A.L.T.

Retired District Educational officer

| | |
|---|---|
| మొదటి తరగతి | 0 4 0 |
| రెండవ తరగతి | 0 5 0 |
| మూడవ తరగతి | 0 6 0 |
| నాలుగవ తరగతి | 0 8 0 |
| ఐదవ తరగతి | 0 9 0 |
| ఆరవ తరగతి | 0 11 0 |
| ఏడవ తరగతి | 0 12 0 |

## గణితం

[పిల్లలకు గణితము, డిక్టేషను గాలో తప్పులు లేకుండ చదివించుటకు, ప్రచురించబడినవి. వాచక పుస్తకములు అనుబంధములు. [Supplements of T. Readers]

| | | | |
|---|---|---|---|
| 1 వ భాగము | 0 3 6 | 3 వ భాగము | 0 4 6 |
| 2 వ భాగము | 0 4 0 | 4 వ భాగము | 0 5 0 |

## భారతదేశీయ చరిత్రలు

డాక్టర్

జి. వి. సీతాపతిరావు, బి.ఏ., ఎల్.టి. గారిచే

| | | | |
|---|---|---|---|
| 3 వ తరగతి | 0 5 6 | 6 వ తరగతి | 0 11 0 |
| 4 వ తరగతి | 0 6 6 | 7 వ తరగతి | 0 15 0 |
| 5 వ తరగతి | 0 8 0 | 8 వ తరగతి | 0 14 0 |

## భారతదేశము

(చరిత్ర)

సి హెచ్. సత్యనారాయణరావు,

ఏ. ఏ. (లిట్) బి. యిడి.

బి. శేషాచార్యులు, బి. ఏ., ఎల్. టి. గార్లచే

| | |
|---|---|
| 4 వ తరగతి | 0 6 0 |
| 5 వ తరగతి | 0 8 0 |
| 6 వ తరగతి | 0 12 0 |
| 7 వ తరగతి | 0 14 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

## హిందూదేశ చరిత్ర

సి. భీమసేనరావు, బి. ఏ., ఎల్. టి.

| | |
|---|---|
| 6 వ తరగతి | 0 11 0 |
| 7 వ తరగతి | 0 13 0 |
| 8 వ తరగతి | 0 12 0 |

7 0

, ఎల్. టి.,

యస్,బి.యిడి.,

వు, బి. ఏ., బి. యిడి.,

0 9 0

0 10 0

0 12 0

ణిక్యం నరసింహారావు, బి. ఏ, యల్. టి.,
ల. వెంకటరత్నం, బి యస్ సి. డి.యఫ్.,బి. యిడి.

| | |
|---|---|
| 3 వ తరగతి | 0 14 0 |

# గణితదర్పణములు

కె. వెంకటేశ్వర్లు, B. A., B. Ed.,
**Deputy Inspector of Schools.**

| | |
|---|---|
| **1, 2 తరగతులకు** | 0 8 0 |
| **3 వ తరగతి** | 0 10 0 |
| **4 వ తరగతి** | 0 14 0 |
| **5 వ తరగతి** | 1 0 0 |

తెనుగులెక్కలు [డి. సుబ్బారాయుడుగారిచే]
0 5 0

నోటిలెక్కలు [యం. సుబ్బారాయుడుగారిచే]
0 5 0

# నేచర్ స్టడీ వాచకములు

నిడమర్తి నారాయణమూర్తి, బి. ఏ., బి. యిడి.,
టి. నరసింగరావు, బి. ఏ., ఎల్. టి., గార్లచే

| | |
|---|---|
| **మూడవ తరగతి** | 0 4 0 |
| **నాలుగవ తరగతి** | 0 6 0 |
| **ఐదవ తరగతి** | 0 7 0 |

# ప్రాథమిక విజ్ఞానశాస్త్రములు

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి ఏ.బి.ఇడి. గారిచే

| | |
|---|---|
| **ఆరవ తరగతి** | 0 10 0 |
| **ఏడవ తరగతి** | 0 12 0 |
| **ఎనిమిదవ తరగతి** | 0 14 0 |



| | |
|---|---|
| ఆరవ తరగతి | 0 14 0 |
| ఏడవ తరగతి | 1 0 0 |
| ఎనిమిదవ తరగతి | 1 0 0 |

# ప్రాథమిక భూగోళములు

[1941 సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి]
కె. వేంకట్రావు. బి. ఏ., బి. యిడి, గారిచే

| | | | |
|---|---|---|---|
| 2 వ తరగతి | 0 4 0 | 3 వ తరగతి | 0 5 0 |
| 4 వ తరగతి | 0 9 0 | 5 వ తరగతి | 0 11 0 |

# ఆదర్శ భూగోళశాస్త్రము

ఆర్. ఎస్. రాఘవులు, బి. ఏ, ఎల్. టి., గారిచే
[రిడైజ్డు]

| | |
|---|---|
| 6 వ తరగతి | 1 0 0 |
| 7 వ తరగతి | 1 0 0 |
| 8 వ తరగతి | 1 0 0 |

# బాలగానమాల

సంగీతము-[స్వరములతో] కె.రామకృష్ణశాస్త్రి గారిచే

| | | | |
|---|---|---|---|
| 1 వ తరగతి | 0 3 6 | 2 వ తరగతి | 0 4 0 |
| 3 వ తరగతి | 0 4 0 | 4 వ తరగతి | 0 4 6 |
| 5 వ తరగతి | 0 4 6 | 6 వ తరగతి | 0 5 6 |
| 7 వ తరగతి | 0 5 6 | 8 వ తరగతి | 0 6 6 |

4 వ తరగతి [స్వరం లేకుండా] 0 3 6

# నిఘంటువులు

| | | |
|---|---|---|
| అమరకోశము ప్రథమకాండ | | |
| | మూలం | 0 3 0 |
| | సటీక | 0 10 0 |
| అమరం త్రికాండ సటీకా క్యాలికో | | 4 8 0 |
| ఆంధ్రనామ సంగ్రహము సటీక | | 0 10 0 |
| ఆంధ్ర నిఘంటుత్రయము | | |
| డిటో | అట్టబైండు | 2 0 0 |
| డిటో | క్యాలికో | 2 8 0 |
| శబ్దమంజరి | | 0 8 0 |

| | | | |
|---|---|---|---|
| బృహన్నల విజయము | 0 15 0 | పరశు | |
| ముక్తాంబ | 0 12 0 | ఉత్తరరా | |
| అజ్ఞాతవాసము | 0 7 0 | రాజసూయము | |
| పురాణ చంద్రిక 1 వ భాగము | 0 8 0 | ప్రతాపరుద్రుడు | |
| డిటో 2 వ భాగము | 0 10 0 | కురువంశము | |
| దశావతారములు | 0 10 0 | ఆంధ్రరాజులు | |
| షట్చక్రవర్తులు | 0 9 0 | ఆంధ్రులు | |
| చారిత్ర నాటక పంచకము | 0 9 0 | ఉపాఖ్యాన రత్నావళి | |
| పోటీ పరీక్షావ్యాసములు | 1 1 0 | భోజ చరిత్ర | |
| యదువంశము | 0 9 0 | రుద్రమదేవి | |
| రఘుకుల వీరులు | 0 9 0 | భారత నారీమణులు | 0 |
| హరివంశము | 0 13 0 | ప్రహ్లాద చరిత్ర | 0 5 0 |
| అనసూయ | 0 5 0 | రామాయణసారము | 0 9 0 |
| నోముల కథలు | 0 5 0 | భారతసారము | 0 1 |
| జాతీయ కథావళి | 0 5 0 | భాగవత కథాసారము | 0 |
| నీతి కథామంజరి | 0 3 0 | కర్ణ చరిత్ర | 0 |
| పర్వదిన మహాత్మ్యము | 0 5 0 | భీష్మ చరిత్ర | 0 9 [illegible] |
| భీష్మ మహిమ | 0 6 0 | నీతిచంద్రిక | 0 8 0 |
| కథా రామాయణము | 0 7 0 | శ్రీరామచంద్రమూర్తి | 0 6 6 |
| అభిమన్యుడు | 0 7 0 | తిన్నడు - గుణనిధి | 0 11 0 |
| మోహన (నవల) | 0 7 0 | | |

# శ త క ము లు

| | | | |
|---|---|---|---|
| సుమతి శతకం మూలం | 0 2 0 | ప్రహ్లాద చరిత్ర సప్తమస్కంధము మూలం | 0 8 0 |
| ,, సటీక | 0 4 0 | కృష్ణశతకము మూలం | 0 2 0 |
| దాశరథి శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 6 0 | భాస్కర శతకము మూలం | 0 2 0 |
| వేమన శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 10 0 |
| ,, సటీక | 0 5 0 | కుమారీ శతకము మూలం | 0 2 0 |
| నృసింహ శతకము మూలం | 0 3 0 | ,, సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 10 0 | బాలరామాయణము మూలం | 0 2 0 |
| సుదతీ సునీతి శతకము మూలం | 0 2 0 | ,, సటీక | 0 4 0 |
| ,, సటీక | 0 5 0 | కుమార శతకము మూలం | 0 2 0 |
| గజేంద్రమోక్షము మూలం | 0 4 0 | , సటీక | 0 5 0 |
| ,, సటీక | 0 10 0 | భర్తృహరి సుభాషిత నీతిశతకము సటీక | 0 6 0 |
| కుచేలోపాఖ్యానము (పోతన) | 0 6 0 | రుక్మిణీ కళ్యాణము | 0 4 0 |
| కుచేలోపాఖ్యానము (గట్టుప్రభువు) | 0 8 0 | ,, సటీక | 0 10 0 |
| భోగినీ దండకము (పోతన) | 0 3 0 | నలోపాఖ్యానము సటీక | 0 10 0 |

, 10 పత్రములు,

, మొత్తము 48

డజను రు. 1-8-0.

ప్రతి 1కి రు 0-2-6.

| | |
|---|---|
| ...రముల కాగితము | 0 2 0 |
| ...క్షరబోధిని | 0 2 0 |
| గ్లషు అక్షరముల కాగితము | 0 2 0 |
| నిలబసుచార్టు నెలవారి, తరగతివారి | |
| సబ్జక్టువారి 1-5తరగతులకు సెట్టు1కి | 0 8 0 |
| గీషువర్క్సుబిల్డింగుపెట్టె | 0 8 0 |

ఈ క్రింది ఉపకరణములైన గ్రంథములు గవర్న మెంటువారిచే ఆంగ్లమున ప్రచురింపబడుటచే ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయుల కనువగునటులను, అందుబాటులో యుండులాగునను తెలుగున అనువదించి ప్రచురించితిమి. పాఠశాలా నిర్వహణమునకు ముఖ్యావసరములు.]

| | |
|---|---|
| ప్రాథమిక విద్యానిబంధనలు | 0 3 6 |

1941 సం॥రపు జా|గ్రఫ సవరణలు —

| | |
|---|---|
| ఆంధ్రానువాదము | 0 10 0 |
| మద్రాసు ఎలిమెంటరీ ఎడ్యుకేషనల్ మాన్యుయల్ | 1 12 0 |

[యం. శంకరయ్య- B. A L. T. గారిచే]
[ఆంధ్రానువాదము]

ప్రస్తుత ప్రాథమిక పాఠశాలలలోని ఉపాధ్యాయులు కొందరు 1940 సం॥రపు నూతనసిద్ధాంతముల ప్రకారము ట్రయినింగు అయినవారు కానందున 1940 సం॥రపు నూతన ట్రనియింగు ప్రణాళిక ననుసరించి ప్రచురింపబడిన యీ క్రింది పుస్తకములు ప్రతి ప్రాథమిక పాఠశాలలోను బోధించుటకు ముఖ్యావసరములై యున్నవి.

1. బోధనాపద్ధతులు :—

| | |
|---|---|
| i. తెలుగు బోధనాపద్ధతులు | 1 2 0 |
| ii. గణితాబోధనావిధానము | 1 4 0 |
| iii. సృష్టిపరిశీలన - తోటపని | 0 10 0 |
| iv. దేశీయచరిత్ర సివిక్సు | 0 10 0 |
| v. భూగోళశాస్త్రబోధనా విధానము | 0 9 0 |
| 2. శిశుస్వభావము-విద్య | 1 0 0 |
| 3. గ్రామసాంఘిక సమస్యలు | 1 12 0 |
| 4. పాఠశాలానిర్వాహకత్వము | 1 8 0 |

## ప్రాథమిక పాఠశాలల క్రొత్తనమోనాఫారములు, రిజష్టర్లు

[క్రొత్తగా మారిన రూల్సు ప్రకారము తయారుచేయబడినవి.]

ఫారములధరలు 100 కి

| | |
|---|---|
| నెలసరి లెక్కలు [మంత్లీరిటరను] | 2 0 0 |
| డిఫాల్టర్లలీష్టు | 1 0 0 |
| రికార్డుషీటు | 1 12 0 |
| సాలుసరి పరీక్ష స్టేటుమెంటు | 3 8 0 |
| ట్రయినింగుస్కూలు అడ్మిషన్ఫారములు | 3 0 0 |
| డిటో బేసిక్ ట్రయినింగుఫారములు | 8 0 0 |
| అటెండెన్సు 12 పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| అక్విటెన్సురోలు12. పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| టీచరు అటెండెన్సు 12 పేజీలు | 0 6 0 |
| టీచరు అంటెండెన్సు 24 | 0 12 0 |
| అడ్మిషన్ రిజిష్టరు 12 పే॥ 0 6 0 24 పే॥ | 0 12 0 |
| అడ్మిషన్ దరఖాస్తులు | 1 0 0 |
| ప్రాగ్నెషను లీష్టు | 1 12 0 |
| విజిటర్ల పుస్తకము 40 పేజీలు | 0 6 0 |
| పిల్ల జనాభారిజిష్టరు 150 యిండ్లకు | 1 6 0 |
| డిటో 300 యిండ్లకు | 2 12 0 |
| జరిమానాల రిజిష్టరు | 0 6 0 |

## ప్రాథమిక పాఠశాలల వివిధపుస్తకములు

| | |
|---|---|
| గణితబోధిని | 0 2 0 |
| ఆంగ్లో తెలుగు ప్రైమరు | 0 4 0 |
| వినాయకచవితిపుస్తకము | 0 1 0 |
| ఎక్కముల బుక్కు | 0 1 0 |
| దసరాపద్యములు | 0 2 0 |
| కోలాటకీర్తనములు | 0 2 6 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము

[పద్యకావ్యము - పోతన ప్రణీతము]
చక్కని క్యాలికో బైండు

సంపూర్ణప్రతి - ఒకే సంపుటము 12 0 0
సంపూర్ణప్రతి - రెండు సంపుటములుగా 14 0 0
డిటో విడివిడిగా ఒక్కొక్కప్రతి 7 8 0
సంపూర్ణప్రతి-మూడు సంపుటములుగా 16 0 0
డిటో విడివిడిగా ఒక్కొక్కప్రతి 6 0 0

# శ్రీమదాంధ్రమహాభారతము

[పద్యకావ్యము - కవిత్రయ ప్రణీతము]
చక్కని క్యాలికో బైండు

1 ఆది, సభాపర్వములుగల సంపుటము 4 0 0
2 అరణ్యపర్వము 4 0 0
3 విరాటోద్యోగపర్వములు 4 0 0
4 భీష్మ, ద్రోణపర్వములు 4 0 0
5 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీ పర్వములు 4 0 0
7 శాంతిపర్వము 4 0 0
8 అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస,
మౌసల, మహాప్రస్థానిక,
స్వర్గారోహణ పర్వములు 4 0 0

శ్రీమదాంధ్ర మహాభారతము
7 సంపుటముల సెట్టు 28 0 0
డిటో 3 సంపుటములలో 26 0 0
1 ఆదిపంచకము - ఒకే సంపుటము 10 0 0
2 యుద్ధషట్కము - డిటో 8 0 0
3 శాంతిసప్తకము - డిటో 8 0 0

## శ్రీమదాంధ్ర మహాభారతము

[వచనము] 8 0 0

మహావాది వెంకటరత్న ప్రణీతము B. A.
[ఆదిపర్వము, సభాపర్వము
రెండు సంపుటములు క్యాలికో]

## భారతం శాంతిపర్వము

[పద్యం, మున్నంగిశర్మ పరిష్కృతము, సులభముగ
అర్థమగుటకు వ్యాకరణము తెలుపు గుర్తులతో]
3 0 0

శ్రీ...
డిటో ఆంధ్ర
క్యాలికో బైండు
డిటో రేపరు బైండు
డిటో మూలం
డిటో ఆంధ్రవచనము చిన్నసైజు
భాస్కర రామాయణము క్యా
(పద్యకావ్యము)
భర్తృహరి సుభాషితము 4
భర్తృహరి సుభాషితము
(నీతిశతకము మాత్రము టీక) 0 6 0
శ్రీకృష్ణ కర్ణామృతము 3 0 0
శ్రీరామకర్ణామృతము 2 8 0
హరిశ్చంద్రోపాఖ్యానము ద్విపద
(గౌరన) 1 0 0
నలచరిత్ర డిటో 0 10 0
మొల్లగుండ రామాయణము 3 8 0
[హరికథ] యక్షగానము క్యాలికో
మొల్ల రామాయణము 1 0 0

## అష్టాదశ పురాణసారము (వచనం)

4 భాగములు విడిప్రతి ఒక్కొక్కటి 1 4 0
4 భాగములు క్యాలికో ఒకేసంపుటములో 5 8 0

**భగవన్నుతి - (3 భాగములు) 0-10-0**

విజ్ఞానలహరి 0 6 0
ప్రార్థనదీపిక 0 2 0
కుశలవ నాటకము 0-12-0

## స్తోత్రములు, సహస్రనామములు

శ్రీసహస్రనామ స్తబకము [క్యాలికో] 1 0 0
,, [రేపరు] 0 12 0
ముకుందమాల [సటీక తాత్పర్యము] 0 8 0
ఆదిత్యహృదయము ,, 0 6 0
సవిత్రుసర్వస్వము ,, 0 4 0
నీతిశాస్త్రము ,, 0 4 0
భజగోవిందశ్లోకములు ,, 0 3 0
శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము 0 3 0

| | |
|---|---|
| | 0 12 0 |
| | 0 5 0 |
| | 0 5 0 |
| | 0 5 0 |
| ...ము | 0 5 0 |
| ...మము | 0 5 0 |
| ...నామము | 0 8 0 |
| ...ణము | 0 2 0 |
| ...హ్మయజ్ఞము | 0 2 0 |
| సంధ్యావందనము | 0 6 0 |
| మంత్రపుష్పము | 0 2 0 |
| యూనానీ వైద్యామృతసాగర్ (వైద్యగ్రంథము | 4 0 0 |
| గీతా హృదయము [డా॥ శంకర శ్రీరామారావుగారిచే] | 0 12 0 |
| సంగీతాలు | 0 12 0 |

## ఆంధ్ర దశరూపకము

(A Book on Telugu Dramaturgy)

రచయిత :

బ్ర॥ శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు

(Retired Lecturer, Andhra University)

వెల రు, 0-15-0

## జనమంచి శేషాద్రిశర్మగారి గ్రంథములు

### పద్యకావ్యములు

| | |
|---|---|
| ఆంధ్ర శ్రీమద్రామాయణము, నిర్వచనము 7 సంపుటములు | 18 0 0 |
| 3 సంపుటములు | 15 0 0 |
| బ్రహ్మాండ పురాణము | 6 0 0 |
| తెలుంగు బ్రహ్మపురాణము | 5 0 0 |
| తాండవకృష్ణ భాగవతము | 4 0 0 |
| కౌమారికా ఖండము [స్కాందము] | 4 0 0 |
| హనుమద్విజయము | 0 10 0 |
| కవివిలాసము 1 వ భాగము | 1 0 0 |

### వచనములు

| | |
|---|---|
| శ్రీ కృష్ణావతారతత్త్వము 12 సంపుటములు | 21 0 0 |
| ఒక్కొక్కటి | 1 12 0 |
| శ్రీ రామావతారతత్త్వము 11 సంపుటములు | 19 4 0 |
| ఒక్కొక్కటి | 1 12 0 |
| ఉత్తమమార్గము | 1 0 0 |
| భగవద్గీత, విపులమగుటీక | 1 8 0 |
| మనుచరిత్ర హృదయావిష్కరణము | 0 12 0 |
| సత్త్వవర్తనము | 0 12 0 |
| నీతిరత్నావళి | 0 10 0 |

## వివిధ గ్రంథములు

| | |
|---|---|
| వ్యవహారబోధిని 1 భా॥ | 0 5 0 |
| వ్యవహారబోధిని 2 భా॥ | 0 8 0 |
| తెనాలి రామలింగనికథలు | 0 4 0 |
| రామేశ్వరమజలీకథలు | 0 14 0 |
| చంద్రశేఖరశతకము | 0 3 0 |
| భాషీయదండకము | 0 3 0 |
| ఆంజనేయదండకము | 0 1 0 |
| ధర్మసూక్ష్మం [పద్యకావ్యం] | 0 4 0 |
| హస్తసాముద్రికము | 0 5 0 |
| అధ్యాత్మరామాయణకీర్తనలు [రేపు] | 1 0 |
| ఉద్భ్రాంతస్వప్నము | 0 3 0 |

## ఇతరులవి

| | |
|---|---|
| రుక్మిణీకళ్యాణము [అచ్చతెనుగు గబ్బము] 3 ఆశ్వాసముల మహాప్రబంధము | 0 12 0 |
| కొండవీడు నాటకం | 0 3 0 |
| విలాసిని [పద్యకావ్యము] | 0 6 0 |
| చంద్రికావిలాసము | 1 0 0 |
| మిటారులనీటు [వచనము] | 0 6 0 |
| పాతాళద్వీపము | 0 4 0 |
| యువయువతీ విద్యాసాహచర్యము | 0 4 0 |

వలయువారు :—

## రామా అండ్ కో., H.O. ఏలూరు.

బ్రాంచెస్ :—గుంటూరు, రాజమండ్రి, భీమవరం, తెనాలి, వి యనగరం.